# కర్మయోగులు

సరస్వతీపుత్ర :

పుట్టపర్తి నారాయణాచార్యులు




C
894.8133
NAR



విద్యోదయా పబ్లికేషన్సు,
కడప

# కర్మయోగులు

'సరస్వతీపుత్ర'
పుట్టపర్తి నారాయణాచార్యులు

విద్యోదయా పబ్లికేషన్సు
కడప

# మనవి

ఈ పుస్తకములోని యిద్దఱు వీరులును యించుమించు - ఒక శతాబ్దములోని వారే. కాకున్న నొకటి రెండు దశాబ్దములు ముందు వెనుకల జరగెనేమో! ఒకడు జాతి ధర్మమును బ్రతిష్ఠించుటకై ప్రయత్నించి కృతకృత్యుడైనవాడు. జంబుకేశ్వరుడు 'విశ్వధర్మ ప్రతిష్ఠాపనకై యత్నించి - తాను బలియైనవాడు. ఈ రెండుఘట్టములందును ప్రజలు జూపిన చైతన్యము సామాన్యమైనది గాదు. కర్మయోగులకు గలవిలువ వారి కార్యసాఫల్యతనుబట్టి గాదు, వారి ప్రవృత్తిని బట్టి.

'ఆంధ్రజాతి' 'ఆంధ్ర దేశము' అను నావేశము - నాటిది నేటిది గాదు. అది బంద్రెండవ శతాబ్దముననే యారంభమైనది. దానికి శ్రీకారము జుట్టిన కర్మయోగి, కాపయనాయకుడే.

ఈ పుస్తకమున భాషను సాధ్యమైనంత సులభముగ వాడితిని. తెలుగు పలుకుబడులనే యెక్కువగ నుపయోగించితిని.

రామచంద్రారెడ్డి నా కన్నిరీతుల హితుడు. అతడు నాతో నీ రచన చేయించెను.

విద్యా శాఖాధికారులు, నా యీ ప్రయత్నము నాదరింతురని యాకాంక్షింతును.

—పుట్టపర్తి నారాయణాచార్యులు

# విషయ సూచిక:

# కాపయ నాయకుఁడు

కాలము సుదర్శన చక్ర స్వరూప మని పెద్ద లన్నారు. దానికి శతకోటి యంచులు. ఒక యంచు వలె మఱి యొకటి యుండదు. ఒక దాని రంగువంటిది వేఱొక దానిది గాదు. ఆ చక్ర మెప్పుడును దిరుగుచునే యుండును. ఒక యంచు గడచి వేరొక యంచు వచ్చుట కెంతకాలము బట్టునో జెప్ప గలవాఁ డెవ్వఁడును లేఁడు. దాని పరివర్తనము నిరంతరము సాఁగుచునే యుండును. ఆ చక్రాకారములు రక్షణ శిక్షణాత్మకములు. ఈ రెండు క్రియలుఁ గూడ వ్యావహారికో సత్యములో, కాక పరమార్థములో— యది యును మనకుఁ దెలియదు. దాని పరివర్తనములకు బైన నిలచి దాని గమన మిట్టి దట్టి దని చెప్పగల వారు లేరు. అది హా జ్మనసాతి భూమి. దాని గమనము విచిత్రమున్న చో జాలదు. అవేద్యము.

కాకతి ప్రతాపరుద్రుఁ డాంధ్ర దేశమున వెలిఁగిన యొక గొప్ప వెలుఁగు. అతని సామ్రాజ్యమున నవలక్ష ధనుర్ధరు లెప్పుడును విక్రమము రూపుగొన్నట్లు; ఓరుగల్లు నగరమున కున్న వైభవ మాకాలమున ఢిల్లీకి లేదు. ఆ

నగరము పర భయంకరము. ఎక్కడఁ జూచిన దేవాలయ గోపురములు, రాజ భవనములు. దాని ప్రాకారములు తారకా మండల స్తంబకావతంసములట! ఏకశిలా నగర దుర్గ ప్రాకారములకు వెలుపలను లోపలనుఁ గూడ నుండిన వాటిక లనేకములు. ఆ నగరము చుట్టును—నా జనుల రసికతవంటి పూల తోటలు. వారి సంపద వంటి ఫల భరితములైన వృక్షములు. స్వచ్ఛ శీతల జల సంభరితములై, వారి మనస్సుల వంటి జల ప్రవాహములు. నాటి యాంధ్ర దేశ సౌభాగ్యము దక్షిణాపథము నంతయుఁ గన్నుగోర గింపఁ జేసినది. తమిళకవి 'కంబరు' కాకతీయుల రక్షణ నంది నాటి యాంధ్ర దేశమును బ్రహ్మాండముగ వర్ణించెను.

ఓరుగల్లునకు గన్నమ నాయుడు రక్షఃపాలుఁడు. ఈతఁడు ప్రతాపరుద్రుని మంత్రులలో విశ్రుతుఁడు. చక్కని యందగాఁ డట! ఎల్లయనాయక మేచయ నాయకులు గన్న మంత్రి తమ్ములు. ఉన్మద పరిసంధి సింధుర సమాజ విదారణ సింహములు. అందులోను మేచయ నాయకుఁడు పిడుగు వంటి వాఁడు. ఆతని ప్రతాపాగ్ని యాశా గజేంద్రకర్ణానిలములతోఁ బజ్వరిల్లినది. అతని సితకీర్తి దిగ్వధూ దర హాస దీప్తులతోఁ జెలిమి సేసినది. మేచయ నాయకుని జయలక్ష్మికి సకల మహీపాల హృదయములు నివాళు లిచ్చినవి. ఆయన వీర ప్రతాప రుద్రునకుఁ గడుంగడుఁ గూర్చు నెచ్చెలి. ఇందులూరి రుద్రరాజు ప్రతాపరు

రుద్రుని సైన్యాధ్యక్షులలో నొక్కఁడు. ఇతఁడోరుగంటి యొక్క తూర్పు గవని మొదలు సింహాచల పర్యంతము గల భూమి నేలెను. ఇందులూరి రుద్రయ్య పరాక్రమ ముద్రగ మైనది. బెండపూడి యన్నామాత్యుఁడు ప్రతాపరుద్ర రాజ్య భార ధురంధరులలో నొక్కఁడు. ప్రతాపరుద్రుని గజసైన్య మన్నా మాత్యుని పర్యవేక్షణ క్రింద నుండినది. అన్న మంత్రి 'ధాటి విఘటిత కుమ్మటో ద్యానుఁడు'. ఈ కుమ్మటము మన యానగొంది దగ్గర. అన్న మంత్రి పరమ మహేశ్వరాచారుఁడు. సాహిణిమారుఁడు ప్రతాపరుద్రుని యశ్వాధిపతి. మారయ భాస్కర రామాయణ కృతిపతి. వీరే గాక ప్రతాపరుద్రునకు రక్షగా డెబ్బది యైదుగురు దుర్గాధిపతులుండిరి.

నాఁడు బలిసినది వీరశైవము. భైరవార్చనము లింటింట నుండెడివి. మైలార దేవుని పూజ యానాటి జనులకు మెప్పు. ఈ దేవుఁడు భైరవుని తోడి జోడు. ఏకవీర దేవి యొక్క మహోత్సవములు—ఆంధ్ర దేశమున మహోత్సాహముతో, నొనర్పబడు చుండెను. ఏకవీరాదేవి రేణుకయే! ఆమె కొడుకే గదా పరశురాముఁడు. ఏకవీర యాదిశక్తి యొక్క స్వరూప మని యా జనుల విశ్వాసము. ఉత్సవ దినములలో నేకవీర యెదుట 'బవినీలు' నిలబడి పరశు రాముని కథలు వీర రస గుంభితముగఁ బాడెడు వారు.

యుద్ధము లందు మహాశూరులై పోరాడి ప్రాణముల గోల్పోయిన వారిని యానాటి జనులు బూజించు చుండిరి. ఆ వీర పురుషులకు, గుడులు నిర్మించెడు వారు. ఇట్లా రాధింపం బడు వీర పురుషుల యొక్క విగ్రహము లాంధ్ర దేశ మందంతటను గనపడును. ముఖ్యముగ పల్నాటి వీరుల యాలయము లోరుగల్లున ప్రసిద్ధములు. అప్పటికే, పల్నాటి వీరుల విక్రమోజ్వల గాథ ద్విపద ప్రబంధముగ రచింపం బడి యుండెను. దీని నా పల్నాటి వీరుల శౌర్య ప్రతాపముల బ్రకటించు హస్తముదలతో—తాండవారభటులతో 'బవినీలు' బాడెడు వారు. ఆ ప్రబంధముల బాడువారి వేష రచనమే వేరు. వారు ధరించిన పుష్పహారము లరుణములు. పచ్చని పిండి గంథము నొడలంతయుం బూసికొని యుందురు. వేణి బంధములు వారి పాటల దాటింపులలో సడలి మూపులపై వేలాడు చుండెడివి. రంగు రంగుల కాసె పుట్టములు గట్టుకొనెడి వారు. ఈ వేషములతో పాటలు బాడు చున్నప్పుడు జనులు తండోప తండములుగ నా పాటలు వినెడి వాడుక.

ఆ కాలమున ఘటికా యంత్రము లుండెడివి. అప్పుడు ఘడియలను బట్టి గంటలను గొట్టు చుండెడి వారు. పూటకూళ్ళ యిండ్లూరూర. వానిలో 'గప్పుర భోగి బియ్యముతో వండిన యన్నము. దానికిం దోడు గోధుమ పిండి వంటలు. పంచదార గుప్పెడు. క్రొత్తగం గాచిన హయ్యంగ

లీనము. పెసరపప్పు. అరటి మొదలగు పండ్లు. నాలుగైదు నంజుడు గాయలు. శరచ్చంద్ర చంద్రికా ధవళమైన పెరుగు' ఈ భోజన మంతయు నొక రూకకు లభించెడి దట ఓరు గల్లున నాటి మాచలదేవి మిగుల ప్రసిద్ధురాలు. ఆమె యర్థు లకు, సమృద్ధిగ ధనమొసఁగు చుండెడిది. మాచలదేవి కీర్తిని గానము సిన కవు లెందరో యానాఁడు. ఆమె ప్రసిద్ధి దిల్లీ సురతాణికిఁ గూడ లేదట !

ప్రతాపరుద్రుఁ డన్ని రీతుల సమర్థుఁడైన వాఁడు. రాజ్య పాలనమం దెంత చతురుఁడో, సంగీత సాహిత్యము లం దంత నిపుణుఁడు. ఆనాటి కవులలో విద్యానాథుఁడు మకుటాయమానుఁడు. అతఁడు ప్రతాప రుద్రుని యశస్సును గానము చేసిన సంస్కృత కవి. ఆనాటి మఱియొక ప్రసిద్ధ కవి యచింతేంద్రుఁడు. ప్రతాప రుద్రుని శాసనములలోని యాతని శ్లోకము లొక్కొక్కటి ప్రబంధ శతములతో సమానమైనవి. కాకతీయుల నాడు ముఖ్యముగ విజృంభించి నది భరతా భ్యసనము. రాజుయొక్క యంతఃపురము లందే యనేకములు నాటక శాల లుండెడివి. కేవలము కళలనే గాక, ప్రతాప రుద్రుఁ డనేక విద్యావంతులను గూడఁ బోషించిన విజ్ఞాని. ఆతని శాస్త్ర పరిశ్రమ మసామాన్యము. ఆ పరిశ్రమ మునకుఁ బండితులే వెఱ గందెడువారు. ప్రతాప రుద్రుని సభ శాస్త్ర పండితుల సాము గరడీలకు 'ఖుర ' వంటిది.

ఖడ్గ సంచాలనము, తురగ సంచాలన నైపుణి, వ్యూహ రచన మొదలగు విద్య లన్నియు, నానాటి రాచ వారికి సామాన్యములే! ప్రతాపరుద్రున కింతేగాక, యనేక రహస్య విద్యలు దెలిసి యుండెను. ధనుః పాండిత్యమున నతని కతఁడే సాటి! శబ్దభేది మొదలగు విద్య లాతనికి బరిచితములే! చలాచల లక్ష్యములను భేదించు సిద్ధి ప్రతాపరుద్రున కపూర్వముగ నుండెను. గజ సంచాలనమం దాతఁడు సిద్ధహస్తుఁడట! ఆ రాజునకు సేన పరిచ్ఛదము మాత్రమే శాస్త్రములం దకుంఠితమైన మేధయు, ధనువునం దాతతమైన మార్వియు, —నీ రెండే యాతని కర్థ సాధనములు. అస్త్రస్తుఁడై యాతఁడు దన్ను రక్షించుకొనును. అనాసక్తుఁడై యర్థమును జేస్చును. అనాతురుఁడై ధర్మమును బాలించును.

అష్ట మంత్రులు గలిసి చేసిన యాలోచనలు - ప్రతాపరుద్రుఁ డొక్కఁడే జేసెడు వాడు. ఒక్కొక్కసారి ప్రతాపరుద్రుని యూహ లష్టమంత్రుల యూహలకుఁ గూడ నంతు దొరుక కుండెడివి. ఇంత మేధ యున్నను రుద్రుఁడు వినీతుఁడు. డెబ్బది యైదుగురు సామంతులలో నాతని కన్నుదప్పిపోఁ గల వాఁడెవ్వడును లేడు. సామంతుల శరీర మనస్సులలోని ప్రతి కదలికయు, నాచకవర్తికిఁ బరిచితమే! కాని యట్లని సామంతులను వేచికొని తినుటయును లేదు. సామంతుల కెప్పుడును రుద్రునిఁ జూచిన భయము. భయము

మాత్రమే గాదు. ఆత్మీయత. అతఁ డంతగా తోడివారిని ప్రేమించు చుండెను.

ఆకాలమున విజృంభించుచుసది వీరశైవ మత మంటిని. ప్రతాపరుద్రుని కున్న శైవాభిరతి యనన్య మైనది. ఈ ప్రాపుతో శైవమత గురువు లనేకు లాంధ్ర దేశమునకు రాఁ దొడఁగిరి. శ్రీశైలము పుష్పగిరి కోసిగి మొదలైన చోటు లలో వీరశైవ మతము లుండినవి. ఒక్కసారి యైనను శ్రీశైల మల్లికార్జునుని దర్శించినచే జన్మకు ముక్తి యని యానాటి జనుల విశ్వాసము. మండలేశ్వరులైన మహారాజులకు, సామం తులకు గురువు లారాధ్య బ్రాహ్మణులు, లేక శివయోగు లైన బ్రహ్మచారులు. నాటి మంత్రులు లింగ ధారులైన నియోగి బ్రాహ్మణులు; వీరులైన సేనాధిపతులు మొదలగు వారికి గురువులు జంగమయ్యలు. ఈ వీర శైవులకు వీర శాక్తేయ మందును, నభినివేశము గద్దు. వీరశైవ భక్త్యావేశ పరవశులై యున్నప్పుడు శివుఁడు ప్రమథ గణములతోఁ గూడి తమతో నృత్యము సల్పునని యా జనులు భావించెడి వారు. శైవ నృత్యము నందు వారొనర్చు భయంకర కృత్యములు హృదయములకు దిగ్భ్రాంతి గొల్పెడు నట్టివి.

కాకతి రాజ్యమందు నాడు జైనులుఁ గూడ నుండిరి. వీరశైవులకును, జైనులకును ద్వేషములు బెరిగినవి. రాజ్యా ధికారము గలవా రగుటచే వీరశైవులతో, బ్రాహ్మణులు

మైత్రితో వర్తింపఁ జొచ్చిరి. కనుక వీరిర్వురకును, జైనులు శత్రువులే యైనారు. రాజునకు జైనులపై నంత యభిమానము లేదు. అందుచే జైను లెక్కువ గష్టపడ వలసి వచ్చెను. జైన సామాన్యప్రజ దిన దినమునకు శైవులై పోఁజొచ్చిరి. జైన మతాచార్యు లనేకులు కర్ణాటక మహారాష్ట్ర దేశములకు వలస బోయినారు. మిగిలిన కొందఱు 'ధాన్యకటకము' 'యేకశిల' మొదలగు చోటుల నివసింపఁ జొచ్చిరి. వారికిని —యితర పండితులకును దఱచు శాస్త్ర చర్చలు సాగెడివి. మహా విద్వాంసులైన జైనమతాచార్యు లనేకులు వైష్ణవులుగ మారి పోయినారు.

ప్రతాపరుద్రుని నిరాదరణతో బాధపడిన యనేకులైన జైనులు ప్రాణ త్యాగము గావించు కొనిరి. తపస్వులైన జైనులు నానా రీతులఁ ప్రతాపరుద్రుని శపించినారు. ప్రాణహత్య సేసికొన నొల్లక, కొన యూపిరితో జీవించిన జైనులు కాకతీయ రాజ్యమునకుఁ బ్రచ్ఛన్న శత్రువులుగ మారిరి. లోలోన వా రుత్కళ రాజుతోఁ గుట లారంభించినారు. ఢిల్లీ చక్రవర్తులతో మంతనములు సేసిరి. ఆంధ్ర రాజ్యములోని యనేక రహస్యములను, వా రిర్వురకు జైను లెరింగించినారు. జైను లొనర్చిన —యీకార్యముతో నాంధ్ర సామ్రాజ్యము జితికి పోయినది. ప్రతాపరుద్రుని ప్రాణము గూడఁ బోయినది.

ప్రతాపరుద్ర చక్రవర్తి రామచంద్ర దేవుఁడు సమకాలికుఁడైన రాజు. ఆతని రాజధాని దేవగిరి. మహారాష్ట్రము, కుంతల దేశమున కొంత భాగమును రామచంద్రుని యధీనమం దుండెను. ప్రతాపరుద్రునకుఁ దరువాత దక్షిణ దేశమున బలాఢ్యుఁ డీతడే. రామచంద్ర దేవునకును, గాకతీయులకును మనస్పర్థలు కద్దు. కాని సమ బలు లగుటచే వారిలో నొకరి నొకరు జెనక కుండిరి. రామచంద్ర దేవుఁడు గొప్ప శాస్త్రవేత్త. ఆతనికి విద్వత్పండితగోష్ఠు లొక చాపల్యముగఁ బరిణమించినవి. ఈ చాపల్యముతో స్వదేశరక్షణమందు రామచంద్రదేవుఁ డేమారినాడు. ఉత్తర హిందూస్థానమందు ద్రుత తరముగ మార్పులు జరుగుచున్న కాలమది. ఈ మార్పులను రామచంద్రుఁడు గమనింపనే లేదు. సరిహద్దు లందున్న యాతని దుర్గములు బలహీనములుగ నుండెను. ప్రతాపరుద్రుఁడును రామచంద్రుని పాఠమునే యనుసరించినాఁడు.

అల్లాయుద్దీను దక్షిణమున ప్రత్యక్ష మయ్యెను. వానితో నాశ్వీక సైన్యము మాత్రమే యెనుబదివే లుండినది. తక్కిన సైన్యమునకు మితిలేదు. వాఁడు దేవగిరిపైఁ బడెను. హఠాత్తుగఁ గలిగిన యీ దండయాత్రతో రామచంద్రునకు దిక్కు దోచినది గాదు. అతని కడ నున్నది నాలుగువేల సైన్యము మాత్రమే అప్పటికిని స్థైర్యముగఁ

బోయినాఁడు. ఎంత విక్రమము మన్నను, నసాధ్యము సాధ్య మగునా ? రామదేవుఁడు ఓడి పోయెను. సంధికి సన్నాహ మొనర్చి నాఁడు. రామదేవుఁడు ఉల్లాయుద్దీనున 'కాఱు నూర్ల మఱుఁగుల ముత్యములొసఁగెనట వేయి వెండి నాణెములు. నాలుగువేల పట్టు పీతాంబరములు. ఇవిగాక యనర్ఘములైన రెండు నగలు. కొంత దేశము. వీటి యన్నిటికినీ దోడు ప్రతి సంవత్సరమును గట్టవలసిన కొంత కప్పము' ఈ లాభ ముతో నల్లాయుద్దీను, దాత్కాలికముగ ఢిల్లీకి మఱలి నాఁడు.

ఒకసారి దాక్షిణాత్య సంపదను రుచి చూచినాడు గదా ! మఱి వానికి నిద్దుర యెట్లు బట్టును ? తాను మఱలి పోయిన కొన్ని దినములకే, మఱల 'మాలిక్కాఫర్' యను సేనాధ్యక్షుని క్రిందఁ గొంత సేన యొసఁగి దక్షిణదేశ దండ యాత్రకుఁ బంపినాడు. 'మల్లికాఫర్' ఓరుగల్లుపై నెత్తెను. వానికి రామచంద్ర దేవుఁడు బాసట ! తాను దురుష్కు లకు లోఁగి నపుడు ప్రతాపరుద్రుఁ డేల స్వతంత్రుఁడుగ నుండవలె నని రామచంద్ర దేవుని యూహ మల్లికాఫరు దండయాత్ర వార్తను విన్న ప్రతాపరుద్రుఁడు వాని నెదు ర్కొనుటకై లక్ష సైన్యము పంపినాడు. గౌతమీ రమున యుద్ధము సాగినది. ఆ నది నీరు వీరుల రక్తముతో దాసాని పూవుల కాంతిని ధరించెను. ఆంధ్రసైన్యములు 'మల్లి కాఫరు'ను గడి దేశము దాటువరకుఁ దరిమి గొట్టినవి.

వాఁడు వెను దిరిగి చూడక బర్వెత్తి పోయెను. సైన్యములు చెల్లా చెద రయ్యెను. మల్లికాఫరు ఢిల్లీ చూచువరకు వెనుదిరిగి చూడనే లేదు. ఢిల్లీని దరిసిన వెనుక వెను దిరిగి చూచినాఁడు. అపుడు దెలిసినది వాని కాంధ్ర సైన్యములు దన్ను వెన్నాడుట లేదని! ఆంధ్రవీరులు దన్ను వెన్నాడ కున్నను భయముతో ననేక దినములు వారు దన వెనుకఁ దరుము చున్నట్లే వానికిఁ దోచెడిది. యుద్ధ రంగమున నైన గాయములు వానికి మానినవి. కాని భయము మానుటకుఁ జాలకాలము పట్టెను. ఈ పరాభవము వాని యెదలో శూలమై గ్రుచ్చుకొన్నది. కొంతకాలము జరగెను.

రామచంద్రుఁడు గప్ప మెగురవేసి నాడు. ఇది ఢిల్లీ చక్రవర్తి కాగ్రహ కారణ మైనది. అతఁడు మరల 'మల్లికాఫరు'ను దక్షిణమున కంపెను. మల్లికాఫరు సైన్యము లక్ష కాల్బలము. ముప్పది వేల గుఱ్ఱపు దళము. హఠాత్తుగ వాడు దేవగిరిపైఁ బిడుగువలెఁ బడెను. రామచంద్రదేవుని కడ నంత సైన్యము లేదు. ప్రతాపరుద్రుని సాయమడుగుటకుఁ దనకు మొగము లేదు. యుద్ధమున రామదేవుఁ డోడి పోయెను. రామచంద్రదేవుని ఖైదీగ బట్టికొని 'మల్లికాఫరు' ఢిల్లీకిఁ బంపినాడు. అటనుండి వాఁ డోరుగల్లును దేరి చూచెను. సాహసించి పైఁబడ వచ్చినాడు. లక్ష కాల్బలముతో నన్నమ దేవుఁడు వాని కెదురు నడచెను. అశ్వాధిపతి మారయ సాహిణి వానికి వెన్నుబలముగ నుండెను.

గజాధ్యక్షుఁడు మేచయ నాయకుఁడు వీర రసముతో బొంపిరి పోవుచు శత్రువుల దుంపెస లాడెదనని ద్వానై ముందు ముందుఁ బరవళ్ళు ద్రొక్కినాడు. ఆంధ్రసైన్యము గదలి నది. ఆ కదలిక వాసుకి సర్పము గదలినట్లే యుండెను. ఆ సేనా సర్పమునకు వేయి నోళులు. ఒక్కొక్క నోటియం దొక్కొక్క సైన్యాధిపతి. ఏ నోరు కాటు వేసినను మఱి వానికిఁ దిరుగు లేదు. 'మల్లికాఫరు'న సంగతి దెలియును. తెలిసి తెలిసి యెదిరించినాడు. అది వాని మూర్ఖత. ఆ హావము మహా ఘోరముగ నైనది. ఆంధ్ర సైనికుల కత్తికి కండ జిక్కుటలేదు. వారు దరిగి పోసిన మాంసముల రాసులు గొండలై పడినవి. సైన్యాధినేత మల్లికాఫరు సైన్యములకుఁ జెప్పకయే బారెను.

రామచంద్రదేవుఁడు డిల్లీయందు దాగు నెల లుండెను. తాను జేసిన యపరాధమును మన్నింప వలెనని యాతఁడు చక్రవర్తి కాళ్ళ వ్రేళ్ళఁ బడినాడు. డిల్లీ చక్రవర్తి మనసు కరగెను. బా పడిన కప్ప మంతయు దీసికొని, ప్రతివర్షము గప్పము చెల్లింప వలెనని యొప్పించుకొని, రామచంద్ర దేవుని జక్రవర్తి వెనుకకంపెను. రామచంద్రదేవుఁడు మఱల దేవగిరి మొగముఁ జూచినాడు. కాని వానికెప్పుడు నొకటే యాలోచన. ప్రతాపరుద్రుఁడు స్వతంత్రుఁడుగ నుండుట వానికిఁ బెద్ద గంటగింపు. తన రెండు కన్నులు బోయినను మానె- నెదుటివాని కన్నొకటి లొట్టబోయినఁ జాలు నను

కొనుట రామచంద్రుని బుద్ధి. వాడు ఢిల్లీసుల్తానునకు దిన
మున కొక లేఖ వ్రాయు చుండెను. ఆలేఖలలోని విషయ
మంతయు-నోరుగల్లుపైకి దండయాత్ర సలుప ఢిల్లీ సుల్తానును
బ్రోత్సహించుటయే తన రాజ్యక్షేమముపై వానికి మనసే
లేదు. ఆంధ్ర సామ్రాజ్యము నందలి లోటుపాటులను గమ
నించి, ఢిల్లీసుల్తానునకుఁ దెల్పుటయే రామచంద్రునకు
ప్రధాన కృత్యమై పోయినది. వీనికి జైనులు సాయపడిరి.
వారి కర్థము లేని మతావేశము. రామచంద్రుదేవున కకార
ణమైన యసూయ.

'మల్లికాఫరు' మూఁడవసారి దండెత్తి వచ్చినాడు.
ఈసారి వాని సైన్యములు నలుబదివేల గుఱ్ఱములు, లక్ష
కాల్బలము. 'మల్లికాఫరు' దేవగిరి యందుఁ గొంతకాలము
విశ్రమించెను. వానికి రామచంద్రదేవుఁడు బరమానంద భరి
తుఁడై యాథిత్య మొసఁగి నాఁడట

మల్లికాఫరు దండయాత్ర వార్త తెలంగాణమున
'జిచ్చువోలె' వ్యాపించెను. పైపైన జరగు యుద్ధములచే
నోరుగల్లున సైన్యసంపత్తి దగ్గిపోఁ జొచ్చెను. మిగిలిన వీర
వరులు, జయమో - మరణమో యను ధృఢనిశ్చితో ముందుకు
వచ్చిరి. శత్రువులను సరిహద్దులందే యడ్డగించుట కేర్పా
టులు సేయఁబడెను. కాని 'మల్లికాఫరు'నకు గుఱ్ఱపుదళ
మధికము. ఎంత సాహసించినను, నాంధ్రవీరులు శాత్రవు
లను నిలుపలేక పోయిరి. శత్రువులు సరిహద్దులలోని కోటల

నా[క్రమించుకొని, గోదావరి వఱకు ముందుకు వచ్చిరి. ఆంధ్రులు వెనుక వెనుకకు మఱలి రాజధానీ దుర్గమును ప్రవే శించిరి. శత్రువులు మార్గమధ్యమున 'వాణీకవి దేవుని'చే సంరక్షింపఁ బడుచున్న 'సర్బర దుర్గము'ను ముట్టడించినారు. ఆ దురాత్ములు లాకోట కగ్గిఁ బెట్టిరి. వాణీకవి దేవుని వీరభ టులు స్త్రీ శిశు సమేతముగ నా యగ్నిహోత్రము నెదుర్కొని వీర స్వర్గమును జూరగొన్నారు. వహ్నిలో బడక బ్రతికిన వీరులు ప్రాణ పణము లొడ్డి వైరులతోఁ బోరిరి. దక్కిన ఫల మేమున్నది? ఆ వీరవరు లందరు నేల కొఱగిరి. మల్లికాఫరు 'ఓరుగల్లు' దుర్గమును దరిసెను. వాఁడాకోటను ముట్టడించి నాఁడు. బయట నున్నది మట్టికోట. దాని వెలుపలి ప్రాకా రము యొక్క జుట్టుకొలత, బండ్రెండు వేల యైదువందల నలుబది యాఱు గజము లట! ఉక్కు బల్లెములతోఁ బొడిచి నను నామట్టి రాలదు. ఆ కోట యంత బలాఢ్య మైనది. రాచవారు, కమ్మవారు, వెలమలు, రెడ్డివీరులు, వంటరులు, పద్మనాయకులు ప్రతాపరుద్రునకుఁ బాసటగ నిలచి 'విజ యమో-వీర స్వర్గమో' యన్నారు. ఢిల్లీ సైన్యములు బట్టు దల వదల లేదు. లోపలి వీరులు వీరి నెక్కి రానివ్వరు. దిన దినమును ఘోరయుద్ధము జరగు చుండెను. కడకు మల్లికా ఫరు సైన్యములు, మట్టికోట నాక్రమించినవి. ఇక మిగిలినది రాతికోట. ప్రతాపరుద్రుఁడు రాచనగరిలో సభ దీర్చెను. శత్రువులతో సంధి గావించుకొన వలెనని యాతని సలహా.

కాని దన పీసులు వినుట లేదు. యుద్ధమే కర్తవ్యమని వారి తెంపు. అతి కష్టముతోఁ బ్రతాపరుద్రుఁడు తన సేనాధ్యక్షులను సంధి కొప్పించెను. మల్లికాఫరు సంధికి సమ్మతించినాఁడు. వెలలేని రత్నాభరణములతో వాఁడు ఢిల్లీ దారిఁ బట్టెను. ఆ సారి వాఁడు గొనిపోయిన ధనము వేయి యొంటెల మోత యట.

ఇంతలో ఢిల్లీలో నలువు రైదుగురు చక్రవర్తులు మారిరి. 'గయాజుద్దీన్ తుగ్లకు' ఢిల్లీలోఁ బట్టాభిషిక్తుఁ డయ్యెను. రాచరికమునకు వచ్చిన వెంటనే దక్షిణాపథము వైపే వాని చూపు. దేవగిరిరాజు లెప్పటి కప్పు డోరుగల్లులోని దౌర్బల్యములను సుల్తానున కెఱిఁగించు చుండిరి. జైను లప్రమత్తులై బ్రతాపరుద్రుని సైన్యములందుఁ గలఁతలు లేపుటయేగాక కోటలలోని దొసఁగులను ఢిల్లీ కెఱుకఁ బరచెడువారు. ప్రతాపరుద్రుని యాస్థానములోని సేనాధిపతులలోఁ బద్మనాయకులకును, దక్కినవారికిని వైషమ్యములు బెరిగెను. ఇదే యద నని ఢిల్లీసుల్తాను దన కుమారుఁడైన 'యులూఘ్ ఖానును' తెలంగాణముపైకిఁ బంపినాఁడు. వాఁడు వచ్చి యోరుగంటిపైఁ బడెను. ఆ యుద్ధమునందుఁ బ్రతాపరుద్రునివైపు ప్రసిద్ధులైన సేనాపతు లందఱును జచ్చిరి. సైన్యమపారముగ నష్టమైనది. జయము మాత్రము బ్రతాపరుద్రునకుఁ బ్రాప్తించెను. కాని లాభ మేమున్నది? ఆ జయము

భారత యుద్ధమున ధర్మరాజునకు ప్రాప్తించిన దాని వంటి జయము.

'ఉలూఘ్ ఖాను' ఢిల్లీ జేరినదే తడవు మఱల ప్రోత్త సైన్యములతో, ఓరుగంటికి వచ్చెను. మొన్న మొన్ననే యోడిపోయిన శాత్రవులు మఱల నింతలోనే మెత్తి వత్తురని యాంధ్రులు విశ్వసింపలేదు. ఇంతకును గాకతీయ సామ్రాజ్యము భగ్నమగు కాలము దాపురించెను. పద్మనాయకులకును, వెలమలకును, మనస్పర్థలు మెండైనవి. కాని తాత్కాలికముగ వానిని మఱచి సేనాపతులు శత్రువుల నెదిరించినారు. శత్రు సైన్యములు పిశాచములవలెఁ బోరెను. కోట గోడలు బడి పోయినవి. ప్రతాపరుద్రుని సైనికులు వప్రద్వారములు దెఱచికొని ముందునకు దూకిరి. సంకుల సమర మైనది. నాటి యుద్ధమున వీర ప్రతాపదేవుఁడే స్వయముగ సైన్యాధిపతియై బలముల నడపించెను. అతఁడానాడు చూపిన విక్రమ మత్యద్భుతము. కాని దైవము తోడ్పడనప్పుడు, కేవల పురుషకార మేమి చేయును? నవలక్ష ధనుర్ధరుల పాండిత్య మానాఁడు గర్జుని యస్త్ర పాండిత్యమై పోయినది. ఆ సంకుల సమరమందు ప్రతాపుఁడు ఢిల్లీ సేనలకు బందీగా జిక్కినాఁడు. రాజును విడిపించుటకై నాయకు లతి తీవ్రముగఁ బోరిరి. కాని ఫలము మాత్రము సున్న. నాయకులందరు యుద్ధభూమిని మరణించినారు. ఆ యుద్ధమందే పర భయంకరుఁడైన

యెఱ్ఱ దాచానాయుఁడు వీరమరణ మందెను. వీని సుతులే రేచర్ల సింగమ నాయుఁడు, వెన్నమనాయుడు, యాచమ నాయుడును. ప్రతాపరుద్రుఁ డెట్లు చచ్చెనో చరిత్రకుఁ దెలియదు. కొందఱ మతమున ఢిల్లీలోనే చక్రవర్తిచేఁ దల నఱుకఁ బడె నందురు. మఱికొందఱ మతమున చెరనుండి తప్పించుకొని విరక్తుఁడై గోదావరీ తీరమున తప మొనరించి కొనుచు దేహమును త్యజించె నందురు. వేఱు కొందఱు ప్రతాపరుద్రుఁడు నర్మదా నదీతీరమున, శాత్రవుల కనుగప్పి యానది యందుఁబడి ప్రాణహత్య యొనర్చుకొనె నందురు. ఏది యెట్లైనను మఱి తరువాతఁ బ్రతాపరుద్రుఁడు దేశమునకు లేడు.

ఆ యుద్ధమున బ్రతికిన సేనాపతులు మువ్వురు. వారిలో నొక డన్నమంత్రి. రెండవవాఁడు కొలని ప్రతాపరుద్రదేవుఁడు. మూఁడవ యతఁడు రేచర్ల సింగమ నాయుడు. ఈ మువ్వురును మరలఁ దిరుగుబాటును సాగింప నెంచినారు. వీరిలో నన్నమంత్రియు, కొలని ప్రతాపరుద్రుఁడును నప్పటికే, వయోవృద్ధులు. రేచర్ల సింగమ నాయుఁడంత ప్రసిద్ధుఁడు గాఁడు. వీరందరును జేరి ముసునూరి ప్రోలయను దమ నాయకునిగ నెన్నికొనిరి. ఆ నియమమున కద్దంకి వేమారెడ్డియు సమ్మతించెను. వీరితో నార్వేటి సోమరాజుఁ గూడఁ జేరినాఁడు.

ఇంతలో 'తెలంగాణము'న బ్రహ్మాండమగు గలవు రేగెను. ఢిల్లీ యధికారులు ప్రజలను బెట్టిన బాధ లింతంత గాదు. ఆ బాధలతోఁ బ్రజలు దమ వ్యక్తిత్వమును భావింపఁ జొచ్చిరి. అపూర్వమైన తిరుగుబా టారంభ మయ్యెను. ప్రజలు - బన్ను లిచ్చుటలేదు. పంటల నెదిగి రానిచ్చుట లేదు. విప్లవకారుల జట్టు లనేకము లుండెను. ఆ జట్టులకుఁ బ్రజలే నాయకులై నడపు చుండిరి. పగలంతయు వారు గనపడరు. రాత్రులం దూర్లపై బడి కొల్ల గొట్టుకొని పోదురు. అధికారులు ప్రజల నా దుండగుల గుఱించి యడుగుదురు. ఒక్కరు గాని వారి పొలఁకువ నెఱిఁగింపరు. ఎఱిఁగింపుడని చిత్ర విచిత్రములై, భయంకరములైన శిక్షల నధికారులు వేతురు. ఆశిక్షలు వారియెడల వ్యర్థములై పోయెడివి. శరీర క్షోభ వారి యాత్మ బలమును గ్రుంగ దీయుట లేదు. స్త్రీలు గుంపులు గుంపులై రాత్రులందు సైనికుల గుడారములపైఁ బడుదురు. వారు గుఱ్ఱముల లాయములలోఁ జొరఁబడి వాని కట్టుత్రాళ్ళు గోసి వేయుదురు. రహస్యముగ గుడారములు జీల్చి వైతురు. కనపడిన సైనికుని గనపడినట్లే పదిమంది జుట్టికొని చంపి వేయుదురు. ఆ ప్రజల కెవ్వరును 'మీరు తిరుగ బడుడని' నేర్పినవారు లేరు. వారి యాత్మలే వారి కా తిరుగుబాటును నేర్పినవి.

అన్నమంత్రి మొదలైన విప్లవనాయకులు, రాత్రులందు భద్రాద్రి సమీపమున గల యరణ్యములలోఁ జేరి మాట

రెడ్డియు, తెలంగాణమున డిల్లీ సామ్రాజ్యము సాగుట యశక్యముగఁ జేసివేసినారు. ప్రజలు వారి కండగా నిలచిరి. ఆ నాడు ప్రతి పురుషుడును సైనికుఁడే విప్లవకారుఁడే ప్రతి వనితయును ప్రాణ మానలకు లెక్కింపక బోరాడినదే

గోదావరికి తూర్పు ప్రాంతములు, కృష్ణా నదీ ప్రాంతములు, గుంటూరు, నెల్లూరు ప్రాంతములు, డిల్లీ సైన్యముల యధికారముల నుండి, సంపూర్ణముగ విముక్తములైనవి. ఇంతలో ప్రోలయ మరణించినాడు. అతఁ డపుత్రకుఁడు. తన యనంతరము 'కాపయనాయకు'ని ప్రోలయ యధికారిగా నియమించెను. కాపయ దేవరాజు సుతుఁడు. యుద్ధమున ప్రోలయ్య యంతటి వాడు. ముఖ్యముగ నీ తిరుగు బాటులో రేచర్ల సింగమ నాయని పరాక్రమ మద్వియముగ నుండినది. ఆతని సాయము 'కాపయ నాయకు'నకు వేయి చేతులుగఁ బని చేసెను. కాపయ్యయు రాజనీతి చతురుఁడు. వాఁడు ద్వారసము ద్రపు బల్లాణులతో రాయబారములు నడపినాఁడు. ఆర్వీటి సోమయాజును వెన్ను బలముగ నుంచికొన్నాఁడు. వేమారెడ్డి నాదరించినాఁడు. రేచర్ల సింగమ నాయని వీపు దట్టినాడు. ఇందటి సాయముతో 'కావయ్య నాయకుఁ' డోరుగల్లుపై హఠాత్తుగఁ బడెను. అపు డోరుగంటిలో నున్న డిల్లీ సుల్తాను సామంతుఁడు 'మల్లిక్ మక్బూను.' నాఁడు వాని కేమియు దిక్కు దోచలేదు. ప్రజాసహాకారమణువు లేదు. రహస్యముగ శత్రువులు దన సైన్యమున

గలంతలు రేపినారు. కాని వాడు యుద్ధమునకు సిద్ధపడెను. ఆ యుద్ధమునందు 'కాపయ్య నాయకు'ని, సైనికు లవక్ర పరాక్రమమును ప్రదర్శించిరి. 'మల్లిక్ మక్బూలును' తిన్నగా నూరు విడచి జారుకొన్నాడు. ఓరుగల్లు కోట గోడలపై నాంధ్ర పతాక మెగిరినది. ఏకశిలా నగరమున గాపయ నాయకుండు రత్న సింహాసన మధిష్ఠించెను. కొలని ప్రతాపరుద్రుండు యన్నమంత్రి మొదలైన వృద్ధు లానంద బాష్పములు రాల్చిరి. రేచర్ల సింగమ నాయకుడు కాపయ్య నాణిముత్యములతో నభిషేకించెను. అద్దంకి వేమారెడ్డి, యానంద పరవశుం డయ్యెను. ఆర్వీటి సోమేశ్వరుం డా వైభవమునకు గుక్కిళ్ళు మింగెను. మూడవ బల్లాళుండు మురిసి పోయినాడు. 'జయ - జయ! ఆంధ్ర సుర త్రాణా ఆంధ్ర దేశాధీశ్వర!' యని వందిమాగధు లుచ్చైస్స్వరమున 'గాపయ నాయకు'ని కీర్తించిరి. కాకతీయుల వైభవ ప్రభ మఱల నొకసారి 'ఓరుగల్లు'న సహస్ర విధములం దాండవించినది.

ACC NO. 7362
894.8133
NA2
BM: 200

# జంబుకేశ్వరుఁడు

సాయంకాల మయ్యెను. జరఠారుణాతపములు దిక్కుల వ్యాపించినవి. ఆ యాతపములు గగనము నందలి మేఘములపైఁ బడి వివిధములైన కాంతులను గల్పించినవి. కొన్ని మేఘము లంతకు ముందుఁ గాలుకొని నల్లగానుండెను వానిపై నీ యారుణ్యము బడినది. పడినప్పు డవి 'యూదా' రంగుగ మారెను. శశాంక ధవళములైన మేఘములపైఁ బడి యీ యాతపము వానిని గొజ్జంగి పూవుల రంగునకు మార్చినది. కొన్ని మేఘములు వింతగఁ బసుపు పచ్చని ఛాయతో నుండినవి. వానిపైఁ బడిన యీ యాతప మా మేఘములను నలుపు రంగునకుఁ ద్రిప్పినది. నల్లని మేఘములపైఁ బడిన బసిమి దిరిగిన యీ యాతపము వానిని శుకతుండ నిభములగు గాంతులకు మార్చెను. ఆకాశ మంతయు విచిత్రమైన చిత్రశాల. సంసారమును విచిత్రమైనది. ఓహో ప్రకృతి యిట్లు సంసారము నందలి రీతి భేదములను ధ్వని కావ్యమొనర్చి సూచించు చుండును. కను గలిగిన వాఁడు గమనించును. లేనివాఁడు గమనింపఁడు.

సంసారమందు నిట్లే. ఒక్కఁడు స్వార్థపరుఁడు. మరియొకఁ డాదర్శవాది. ఒకఁడు త్యాగి. మఱియొకఁడు భోగి. వేఱొకఁ డీరెంటికిని సమన్వయము గుదిరిననే జీవిత మను

వాఁడు. ఒకానొక మానవుఁడు స్వార్థమునకైఁ బరుల హిం
సించును. వేఱొకఁడు బరార్థమునకై స్వార్థమును నాశన
మొనర్చి కొనును. వీఁ డిది యాదర్శ మనును. వాఁ డది
భ్రమ కనును. స్వార్థపరుని లోకము దుర్మార్గుఁ డనును.
పరార్థపరుని గీర్తించును. కాని వీ రిర్వురును కాల మను
బులి కడుపున గండలై పోవువారే ! వారు పోయిన యనం
తరము గొంత కాలము జనులు వారి ననుకొను చుందురు.
ఒకనిని స్వార్థపరుఁడని నిందింతురు. మఱి యొకనిని బరార్థ
పరుఁడని వందింతురు. వీరినిఁ గూడ నొకనాఁడు కాలము
లంకించి తీసికొని పోవును. అనేక వర్ణాచ్ఛాదితములైన
మేఘములను గటిక చీకటి మ్రింగివేసినట్లు, మఱలఁ దెల్ల
వారును. సూర్యుఁ డుదయించును. మఱల యథాప్రకా
రము వివిధములైన రంగుల తాండవము; మానవ జీవితముఁ
గూడ నింతే? ప్రపంచము నిరంతర కర్మమయము. ఆ కర్మ
యట్లే సాగుచుండును. 'ఇది మంచిది – ఇది చెడ్డ ద'ని
యా కర్మలలో లోకులు దర తమములు నిర్ణయించి
కొందురు. ఆ వింగడింపు వీరి యభిరుచిని బట్టియే !

నాఁడు తుంగభద్రపైఁ గూడ జరరాయణాతపములు
వ్యాపించినవి. అవి దినమును వ్యాపించును. కాని నే డేమో
క్రొత్తగా వ్యాపించిన ట్లుండెను. నీటిపై నున్న యా
మెఱుపు దినమును వలె మనోరంజకముగ నుండుట లేదు.
ఆ యారుణ్యమున నేదియో యమంగళము ధ్వనించు

చుండెను. ఆ నీళుల యందొక యకారణమైన శవముల వాసన. నాటి యా తుంగభద్ర దాల్చిన రక్తాంబర మామె రక్తదాహమునకు సూచకముగ నుండినది. మన మచే తనము లనుకొనుచున్న పదార్థము లొక్కొక్కసారి శుభా శుభములఁ గోరును. వాని కే సంబంధము లేకున్నను నట్లు గోరుట వాని స్వభావము. నిజమున కవి యచేతనములు గావు. వాని న ట్లనుకొనుట మన భ్రమ. మనకుఁ దెలిసిన బరిమితమైన జ్ఞానముతోనే సిద్ధాంతమునకు దిగు తొందర పాటు. జలకణములకుఁ బ్రాణ మున్నదని జైన సిద్ధాంతు లందురు. అట్టిచో నట్టి జలకణముల సమావేశమైన నదుల కేల లేను? వాని నేమన వా రధిదేవత లనిరి. వారి సిద్ధాంతములకు మనము నవ్వుదుము. ఆ నవ్వుట, మన యజ్ఞానము నొక దురహంకారముగ సమన్వయించికొని నవ్వుట. మఱి యచేతనములని మన మనుకొనుచున్న పదార్థములే శుభాశుభముల సూచించుచున్నప్పుడు— జెట్లు చేమలు బశువులు - పక్షులు - మొదలగున వేల సూచిం పవు? సూచించును. వానిని మన ప్రాచీను లర్థము చేసి కొన బ్రయత్నించిరి. ఆ ప్రయత్నము మానవుని యుప కారమునకే ఆ ప్రయత్నమే శకున శాస్త్రము.

ప్రతి దినమును వలెనే తుంగభద్ర యేఱు గట్టుల నున్న పక్షులు గూయుచున్నవి. ఆ కూతలలో దినమును

వంటి యాహ్లాదకత్వము లేదు. అదేమో విపరీతముగ మూల్గిన ట్లుండెను. వృక్ష కంపనము లందును- నేదో యొక యలసత్వ, యనుత్సాహము, దొంగికిసలాడు చుండెను.

విరూపాక్షుని దేవాలయము దీపకాంతులతో జిగజిగ లాడుచుండెను. ఎక్కడఁ జూచినను వేలకువేలు గాచ దీపములు. ఆ దీపముల వివిధ కాంతులు, ఆ దీప సహస్ర ప్రభలు విరూపాక్షుని పైఁ బడి యిట్టి దట్టి దనరాని యొక కాంతి విశేషమును గల్పించినవి. ఆయన ధరించిన వజ్రభూషణముల కాంతులు విజృంభించి కాచ దీపముల మొగములకు దన్నెను. ఈ పరస్పర సమ్మేళనముతో, నాలయ మంతయు నొక కాంతి పరీవాహ మేర్పడెను. ఆ యాలయమున నెన్నో స్తంభములు. ఒక్కొక్క స్తంభమునకును, వేలకొలది దీపము లమర్చి యుండును. గోడల యంచులందు వరుసగా దీపము లుంచఁ బడినవి. అవి యన్నియుఁ గాలపురుషుని కన్నుల ట్లుండెను. ఓహో! కాలపురుషుఁడు పరమాత్ముని తలపు నిన్ని కన్నులతో గమనించునా? ఆ నాఁడు సోమవారము. విరూపాక్షున కంతవరకును రుద్రాభిషేకములు జరగినవి. ఇక సాయంకాల పూజకై యా స్వామి తహ తహ లాడు చుండెను. అప్పటికిఁ బ్రదోషము కొంత గడచినది.

విరూపాక్షుని యెదుట రెండవ విరూపాక్షునివలె నర్చ కుఁడు నిలువఁ బడి యుండెను. ఆతని రెండు కన్నులు మహా తేజోవంతములు. ఆ రెండు కన్నులును శాపానుగ్రహ సామ

ధ్వనులకు సూచకములై యుండినవి. ఆ యర్చకుండు మొగ సాల వైపు చూపులు త్రిప్పి చూచు చుండెను. ఎవరి కొఱకో ?

విరూపాక్షుని యాలయము నిండ జను లుండిరి. కాని జను లున్నట్లే లేదు. వారిలో ననేకులు స్త్రీలు. ఒక్కొక్క తెకు నాపాదచూడము రత్నఖచితములైన భూషణములే ఆ నగల కాంతుల తొడుగులో వారి శరీరచ్ఛాయ లెవ్వరికి ని స్ఫురింపకేదాయె. వా రటు నిటుఁ బనుల తొందరలోఁ దిరుగు చుండిరి. ఆ తిరుగునప్పుడు భూషణ ఘలంఘలలు గూడ విచిత్రముగ నానాడు ధ్వనించుట లేదు. ఏదైన పని గలిగినప్పుడు వారిలో వారు బరస్పర మెచ్చరించికొందురు. ఆ యెచ్చరించుట లాంగికాభినయములతోనే ! కనులతో భావములు ప్రదర్శించు కొందురు. విరూపాక్షున కిఱువైపు లను బరిచారికలు నిలచి యుండిరి. వారి చేతిలోఁ జామర ములు. ఆ చామరలు కుంతల దేశము యొక్క కీర్తినే యనుక రించినవి.

ఇంతలో హఠాత్తుగ శంఖ ధ్వని యయ్యెను. అది మహారాజుల రాకకు గుఱుతు. ఒకానొక యేనుగు వచ్చి మహా ద్వారము కడ నాగినది. దానిపైఁ గప్పిన యంబారీ యనర్ఘమైనది. ఆ యేన్గు వీధులలో నడచి వచ్చునప్పు డా యంబారీ కాంతులు, రాజ గృహముల మొగసాలలపైఁ బడును. నూతన తేజః పుంజ చుళికితములైన యా మొగ

సాలలు గృహస్థులకు మహారాజుల రాకను దెల్పును. వెంటనే యంతకు ముందే దయారు చేసికొన్న నీరాజనములతో వా రా గజమును బూజించి మహారాజునకు నమస్కరింతురు. ఆ గజమున కిఱువైపుల నిరువురు భటులు మాత్ర ముందురు. వారు గరముల ధరించిన బెత్తములు బంగారువి.

వచ్చి వచ్చి యా యేనుగు విరూపాక్ష ద్వార దేశ మున మోకరిల్లెను. పైనున్న యంబారి నుండి మహారాజు క్రిందికి దిగినాడు. ఆ దిగుట స్వర్గమునుండి ధర్మదేవత గ్రిందికి దిగినట్లే యుండెను. అతఁడే జంబుకేశ్వరుఁడు. వీరిది నందవంశము. నందు లెన్నడో యుత్తర హిందూస్థానము నుండి దక్షిణ దేశమునకు వచ్చి సామ్రాజ్యము లేర్పరచు కొన్నారట వారి వంశమున విజయధ్వజుఁడు బుట్టెను. ఆ విజయధ్వజుఁడే విజయనగర పట్టణమును దొలుత నిర్మించిన దందురు. తర్వాత దానిని విద్యారణ్యులు దొడ్డ పట్టణముగా నొనర్చెనట ఈ వంశములోని వాఁడే బిజ్జలుఁడు. అతఁడు గళ్యాణ పురమునకు రాజయ్యెనని రాయ వంశావళి పలు కును. ఈ జంబుకేశ్వరుని తండ్రి ప్రతాపరాయలు. కొంద ఱీ వంశము కదంబుల శాఖయందురు. మఱి కొందఱు హొయి సలుల వంశములోని యొక చీలిక యని వాదింతురు. ఏది యెట్లో దేవున కెఱుక.

జంబుకేశ్వరున కానాడు 'ఆనెగొంది' ముఖ్య పట్ట ణము. రామాయణ కాలమునుండి యానెగొంది ప్రసిద

మైనది. అదియే కిష్కింధ యని యనేకుల యూహ. ఆనె గొంది సమీపముననే 'కంపిలి' యను కోట యున్నది. ఆ కోటయుఁ జాల బలిష్టమైనది. అది జంబుకేశ్వరుని యుప రాజధాని. అందుచే నాతనికి కంపిలి రాయుఁడనియు నామాంతరము గలదు. కాక యులనాటికే యీ వంశము ప్రసిద్ధము. కాకతి చక్రవర్తులకు వీరు సామంతులో గాదో వివరముగఁ దెలియదు. కాకతీయులతో వీరి కెంత సంబంధ ముండినదియు చరిత్ర చెప్పదు. కాని యొకసారి బెండపూడి యన్నమదేవుఁడు 'కుమ్మటము'పై నెత్తి వచ్చెనట అప్పుఁడు యుద్ధ మొనర్చినది గంపిలిరాయఁడే! ఆ యుద్ధమున నన్నమంత్రి గెల్చినట్లే యున్నది. కాని రాజుల జయాప జయములు ఉయ్యాల తూగువంటివి. మరల జంబుకేశ్వ రుఁడు పోయిన బలమును సంపాదించికొని వారి నెదిరించె నేమో? అందుకే గాకతీయుల చరిత్రలో నాతని పేరు సామంతరాజుల వివరములలోఁ గానరాదు. హొసలులతోఁ గూడ కంపిలి రాయునికి యుద్ధములు జరగు చుండెను. ఇతఁడు నాటికిఁ గూడ లోఁబడినట్లు లేదు. ఆరవీటి బుక్క రాజుతో నీతనికి యుద్ధములు జరగిన ట్లున్నది. ఆనాడు బశ్చిమాంధ్రమున నాతఁడు వేఱొక్క స్వతంత్ర నృపా లుఁడు. 'ఆరవీడు' 'చిత్రావతి' నది యొడ్డున నున్న యొక గ్రామము. ఈ యూరివారే విజయనగర చరిత్రలో నంత్య కాలమున ప్రసిద్ధులైన యార్వీటి నరాధిపతులు. ఇంతకును

జంబుకేశ్వరుని కాలమున బళ్ళి వరాంధ్రమునందు మూఁడు నాలుగు స్వతంత్రమ్ములైన చిన్న చిన్న రాజ్యము లుండె నేమో? వారిలో వారికిఁ బెత్తనములకై యుద్ధములుఁ గూడ జరగుచుండినవి.

జంబుకేశ్వరుఁ డేన్గును దిగినదే తడవు వేచి యున్న సర్దారులు నమస్కార మొనర్చిరి. వెలిగొడుగు లేడు మహారాజు వెంట నంటినవి. సరదారుల యెడ జంబుకేశ్వరుని చూపు లాదర మేదురములై యుండెను. ఇరువురు వందు లెదుట నిలచి మహారాజులకుఁ ద్రోవఁ జూపుచుండిరి. విరూపాక్షుని యాలయ ముఖద్వారమును సమీపించినదే తడవు-జంబు శ్వరుని శరీర మేమో వినయావనత మైనది. అతఁడు చేతులు జోడించుకొనియే యుండెను. దారిపొడుగునను బట్టు పీతాంబరములు బరువఁ బడినవి. నాసిపై విదలింప బడినవి బూరేకులు. మొదటి ద్వారమం దా రా జనుగుఁ వెట్టెను. ఆ ద్వారమం దొక శ్వేతచ్ఛత్రము నిలిపి వేయఁ బడినది. రెండవ ద్వారమును మహారాజు సమీపించినాఁడు. అట మఱియొక వెలి గొడుగు నిలిపి వేయఁ బడెను. ఆ ద్వారమున గొంతమంది యువతులు మహారాజు రాకకై వేచి యున్నారు. అతఁ డా ద్వారమును బ్రవేశించినదే తడవు జల్లుమని వా రంద రా భూపాలునిపైఁ బూవుల నొత్తుగాఁ జల్లిరి. మహారాజు మూఁడవ ద్వారమును బ్రవేశించినాఁడు. మూఁడవ వెల గొడు గచ్చట ముడువఁ బడెను. అటఁ గాచి

పెద్దలై యీ వివాహమును నిర్వహించిరి. నాటి నుండి విరూపాక్షుఁడు పంపాపతి. 'ఆనెగొంది' కడ నొక సరోవర మున్నది. పంపాదేవి తప మాచరించునపుడా సరోవరమున దినమును స్నానమును గావించెడిది. ఆ జలము లామె శరీర వాసనచే సువాసితము లైనవి. ఆ సరస్సున బుట్టు పద్మ ముల కదే వాసన. అందుచే నా పద్మములు విరూపాక్షునకుఁ బ్రియమైనవి. అతఁడు దన పూజలో వానినే యుపయోగించు కొనును. ఆ యరవిందముల విరూపాక్షుఁడు ప్రేమించుట పంపాదేవికిఁ గడు నిష్టము. తన సేవ సాధ్యమగునన్ని రీతుల విరూపాక్షునకుఁ జెల్లించుకొన నామె కోరిక గదా!

తుంగభద్రానది వరాహ పర్వతమునఁ బుట్టును. ఆ వరాహమూర్తియుఁ బ్రాచీనుఁడే. ఆ స్వామికి రెండుకోరలు. ఒక కోరనుండి 'తుంగాదేవి' పుట్టును. మరియొక దంష్ట్రిక నుండి భద్రాదేవి జనించును. నేటికిని యీ వరాహమూర్తి దంష్ట్రికలనుండి నీటి బొట్టులు గారుచునే యుండును. దీనికిఁ బ్రకృతి శాస్త్రవేత్త లేమందురో? తుంగ భద్ర లిద్దరక్క చెల్లెండ్రు. ఆ యిద్దరకుఁ గూడ, నక్కజముగ విరూపాక్షుని పైననే మనస య్యెను. వారిద్దరు వరాహ పర్వతము నుండి కొండలు-లోయలు దాటి దుత్తరముగ విరూపాక్షుని కొఱకైఁ బయలిడి వచ్చిరి. ఆ కొండ దారులలో మార్గముఁ దెలియని యక్క చెల్లెండ్లు వేఱుపడినారు. వారికిఁ దిక్కు తోఁపలేదు. కాని విరూపాక్షునిపై మనసు వదలినది గాదు.

దైవమును నమ్మి యా యక్కచెల్లెండ్రిద్దఱు, వేఱు వేఱుగ ప్రయాణించిరి. కడకు వా రిద్దఱొక చోటఁ జేరికొన్నారు. అది విధి విలాసము. ఆ యక్కచెల్లెండ్రు చేరిన చోటు 'కూడ్లిగి'. ఆ ప్రదేశము శివమొగ్గ జిల్లాలో నున్నది. ఆ సోదరీమణు లిద్దఱు నిక విడిపోవఁ గూడ దనుకొన్నారు. వారిద్దఱేక కార్యార్థినులే గదా! మేనులు వేఱైన మనల ని కొండ దాపులలో విడిపోదుమేమో యని వారి భయము. 'తా నిక నక్కను వదలి పోలేనని' భద్రాదేవి చెల్లెలు-తుంగను గట్టిగా కౌగలించి కొన్నది. మనస్విని యైన తుంగాదేవి భద్రను దనలోననే యిముడ్చు కొన్నది. నాటి నుండి వారి మేను లొకటైనవి. హృదయము లొక్కటైనపుడు మేను లొక్క టెందుకు గావు? ఆ పొద్దునుండి యా తరంగిణు లిద్దఱొకటిగాఁ గలిసి పారిరి. వా రిద్దఱికొకటే సముదితమైన నామమయ్యెను. ఆ నామమే తుంగభద్ర. పారి పారి యా తరంగిణులు, ఋష్యమూక ప్రాంతములకు వచ్చినవి. ఆ యిద్దరక్కచెల్లెండ్రపై విరూపాక్ష దేవుని మనసు పడనే పడెను. ఆ దేవుఁ డొకటే రూపు కైన యా యిద్దఱను గ్రహించెను. నేటి కా యిద్దఱును జేరి యొక భార్య క్రింద కే లెక్క. ప్రేమల నింతగా బాదిగించుకొన్న యా యక్కచెల్లెం డ్రెంత ధన్యలో? తుంగభద్రాదేవి విరూపాక్షునకుఁ బంపాదేవి యంతటి భార్య. పంపాదేవి తుంగభద్ర వంటి భార్య. వారి సామరస్యము వర్ణనాతీత మైనది.

జంబుకేశ్వరుని మనస్సు 'హర-హర-హర' యను చున్నది. ఆ కన్ను లన్నే విరూపాక్షునిపై లగ్నమై పోయెను. అట్లెంత సేపు గడచెనో ? అర్చకుఁడు మహారాజునకు మంగళహారతి నొసఁగి నాఁడు. ఆ యర్చకునకు జంబుకేశ్వ రుఁడు మనసార నమస్కరించెను. నిరంతర 'పంచాక్షరీ' పవి త్రమైన జిహ్వతో నా యర్చకుఁడు మహారాజు నాశీర్వ దించెను. రాజు పంపాదేవి సన్నిధిని దరిసెను. కుంకుమ పూజా రాగ రంజితమైన యా దేవి భక్తానుగ్రహము కొఱకై యా మూర్తిలో సాక్షాత్తుగ నన్నే నిలచిన ట్లుండెను. రాజామె సన్నిధిని బ్రవేశించినదే తడవు 'గణ-గణ' మని గంటలు మ్రోగెను. ఆ గణగణలు ముక్తి సం ముక్తాట్ట హాసములు. విరూపాక్షునికి దూర దూరమున వినయావన తుఁడై నిలచిన మహారాజు పంపాదేవిని గన్నతల్లిని వలె సమీపించినాఁడు. ఆమె దయామయి. తుంగభద్ర నీరము లెంత రుచి గలవో, బంపావతి హృదయ మంత సరసమైనది. ఆమె సన్నిధిని సమీపించుటయే తడవు జంబుకేశ్వరున కేలనో రెండు కన్నులందు నీ రోడికలు గట్టెను. ఆ యోడి కలు దుఃఖమునకో - యానందమునకో మహారాజునకుఁ దెలి యదు. రాచకార్యములందు నా జేమి గ్రొత్త విశేషము లేదు. మఱి యా కన్నీటికిఁ గారణము ? ఎందుకును గాదు. పరమ జనని సాన్నిధ్యమున నది ప్రతి యొకనికిఁ గలుగు నొక విచిత్రమైన భావన. మనసున్న వానికెల్ల నా స్థితి దటస్థించి

ంపును. అట నున్న యర్చకుఁ డొక చండీ యుపాసకుఁడు. విభూతి రేఖలచే ధవ ళమైన యాతని నిటాలమున శివుని చిచ్చర కన్నువలె నడుమ మెఱయుచున్న యొక్క కుంకుమ బొట్టు. జంబుకేశ్వరుఁ డా బ్రాహ్మణునకు నమస్కార మొన ర్చెను. ఆ బ్రాహ్మణుఁడు మందహాసమున నాశీర్వదించి నాఁడు. రాజు ప్రసాదమును స్వీకరించి వెను దిరిగెను. క్షణ కాల మాతఁడు విరూపాక్షుని హజారమున విశ్రాంతి గైకొ న్నాఁడు. మరల గజము నధిరోహించి జంబుకేశ్వరుఁ డంతః పురమునకు మరలెను. ఆ మహారాజు ద్వారములు దాటి వచ్చునప్పుడు, దొలుతటి వలెనే వెలిగొడుగు లొక్కొక్కటి యాతని వెంట నడచినవి. జంబుకేశ్వరుఁ డంతిపురపు మొగ సాల సమీపించెను. గజము నాయన దిగినాఁడు. దిగిన వెంటనే యెదుట నున్న సేవకుఁ డొకఁ డాతనికి నమస్కరించెను. మహారాజు బహ్వర్థకముగఁ గనుబొమలు బైకెత్తినాఁడు.

ఆ సేవకుఁడు 'ప్రభూ!' యని సంబోధించెను. ఆ మాటతోనే సేవకుని యంగము లన్నియుఁ బ్రేమ సంవలి తములైనవి. ఆ పిలుపునం దేవో మధుధారలు గురిసిన ట్లున్నవి.

మహారాజుల ప్రాయముఁ గూడఁ గొంచెము బడమ టికి వాలినదే అప్పటికే యాతని సంతానము బదునొ కండుమంది. కేశములు పలితములు గాఁజొచ్చినవి. వార్ధ కము 'నేను వచ్చినాన'ను చున్నది. కాని యా శరీరమున

జంబుకేశ్వరుఁడు నవ్వుచునే 'మంచిది' యనెను. ఆ సేవకుఁడు వినయమున నమస్కరించి ప్రేమతో మహారాజు వైపు దిరిగి తిరిగి చూచుచు వెళ్ళిపోయినాఁడు. నాటి రాత్రి జంబుకేశ్వరుఁడు చారులను బిలిపించెను. వారి ట్లనిరి. 'మహారాజా ఆ యాగంతుకుని పేరు 'బహాదుద్దీను'. 'ఢిల్లీ సుల్తానున కతఁడు మేనల్లుఁడు. సుల్తానుతో నాతనకి వివాదము వచ్చెను. బహాదుద్దీను' సుల్తానుపైఁ దిరుగఁ బడిన ట్లున్నది. అందుచే ఢిల్లీ సుల్తానైన తుగ్లకు సైన్యములు 'బహాదుద్దీను'ను దరిమినవి. ఆతఁడు దమ్ము శరణువేడ వచ్చినాఁ డట?'

జంబుకేశ్వరుఁడు దిన్నగఁ దనలోఁ దాను 'శరణాగత రక్షణమా?' యనుకొన్నాఁడు. ఆ మాట పూర్తి యగుటకు ముందే యాతని మనస్సు 'కానిమ్మ'నెను. 'రేపా యాగంతుకుని నాకడ కర్హ మర్యాదలతోఁ దీసికొని రావలసినద'ని చారుల కానఁ వెట్టెను.

మఱుదినము దెల్ల వారినది. ప్రాతఃకాలమునందే, శివపూజ గావించి గజాశ్వ గోపూజల ముగించుకొన్నాఁడు, జంబుకేశ్వరుఁడు. శివపూజా పవిత్రితమైన యాతని శరీరమందు విరూపాక్షుని తేజస్సు సర్వాంగీణముగ సంక్రమించిన ట్లుండెను. అస్త్ర పరివార సమేతుఁడై 'బహాదుద్దీను' మహారాజును సమీపించెను.

స్వస్థత లేని వాని మొగము పథాశుద్ధి లేని రాజనీతి వలె నుండెను.

వాఁ డనెను. 'మహారాజా! నే నొక యదృష్ట హీనుఁడను'

ఈ యొక్క మాటతో జంబుకేశ్వరుఁడు వాని హృదయమం దణఁగి యున్న సకల వేదనలను గమనించినాఁడు. అతఁడు జల్లగ ననెను. 'నాయనా! లోకమున నదృష్టము - దురదృష్టము - దిన రాత్రులవంటివి. ఏకాంతముగ నదృష్టమునే యనుభవించు మనుష్యుఁ డెవ్వఁడును లోకమునందు లేఁడు. అట్లే నిరంతర దుఃఖభాగియు గానఁబడఁడు. మానవ జీవితమే శబలితమైనది. అదృష్ట సమయములందు సంతోషించుట, దురదృష్టము ఘటిల్లినప్పుడు దుఃఖపడుట, మానవులకు సహజమే యైనను ధర్మము మాత్రము గాదు.'

ఈ మాటలతో బహాదుద్దీను యెదకు నీరు వట్టిన ట్లయ్యెను. అంతకు ముందు దళితమైనట్లున్న వాని రాచరికము మరల యథాస్థానమున నుపవేశితమైనట్లుగ భాసించెను. కాంతి దప్పిన వాని పెదవులపై నొక చిఱునగవు గన్పడి గన్పడనట్లుగఁ దాఁకి పోయినది, కరుణ రసాత్మకమైన వాచ్యార్థమం దన్య రసాత్మకమైన వ్యంగ్యము భాసించియు భాసింపనట్లు. 'బహాదుద్దీను' బలుక నారంభించినాఁడు. 'మహారాజా! నేనా డిల్లీ చక్రవర్తి యగు తుగ్లకునకు మేన

ల్లుండెను. దక్షిణాపథము లందలి 'సాగర్' ప్రాంతములకుఁ బరిపాలకుండుగ నుంటిని. కాని దైవము నాపైఁ వక్రించెను.'

'చాల సంతోషము. గొప్పవారితో సంబంధము లత్యంతము మాకుఁ గోరదగినవి.' జంబుకేశ్వరుఁడు సంభాషణమును బూరించి 'యామెపై వృత్తాంత మే'మన్నట్లు, 'బహదుర్దీను' వైపు విలోకించెను.

'ఖాజజహా' యను నొక యుద్యోగి డిల్లీసుల్తాను చెంత నున్నాఁడు. వాడు ఘూర్జర దేశమునకుఁ బరిపాలకుఁడు.'

'కావచ్చును.'

'వాడు 'జులేఖా' యను కన్యకను బ్రేమించెను. కాని యామె మనసు వానిపై లేదు. ఆ కన్యక నా మనస్సునుఁ గూడ నాకర్షించినది. ఆమెయుఁ దన మనస్సున న న్నంగీకరించెను. ఇది 'ఖాజజహా' గుర్తెరిఁగినాఁడు. దానితో మాయిద్దరి నడుమ రవరవలు బొడమినవి'

'అది సహజమే! ఏకార్థులకు విరోధములు, వైమనస్యములు; మానవచరిత్రలోఁ గ్రొత్తవి గావు.'

'జులేఖా' నావెంట సాగరునకు వచ్చెను. ఆమెనన్ను జేపట్టెను. దానితోఁ గుపు మండిన 'ఖాజజహా' నాపై నున్నవి లేనివి కొండెములు దిన దినమును గల్పించి చక్రవర్తికిఁ దెల్పినాడు. నే నెదుట లేకుండుటయు వానికిఁ గొప్ప యనుకూల మయ్యెను. వాని మాటలు బాగుగఁ జెవి కెక్కిన

డిల్లీ సుల్తాను నన్నకారణముగఁ జీటికి మాటికి వేధింప జొచ్చెను. దానితో నాకు విసుగైనది.'

'నిజము - నిజము రాచరికమొక యోగము. వాఁడన్ని భావములను స్వాధీనమున నుంచికొన వలెను. సముచితముగ నావిష్కరింప వలెను. కానినాఁడు వాని నిగ్రహానుగ్రహములు రెండును, నియమముఁ దప్పినవై, భయంకరముగఁ బరిణమించును.'

'ఇంతలో దాక్షిణాత్య రాజులు గొందఱు డిల్లీసుల్తానుపైఁ దిరుగ బడినారు. నాకుఁ గూడఁ దిరుగఁ బడుదును మను బుద్ధి జనించినది. తిరుగ బడితిని.'

'అవు నవును! లోభమును దమించుటకు గొప్ప తపస్సుఁ గావలెను. అందఱ కిది యసాధ్యము. సాధారణముగఁ బ్రకృతి మానవులపై నిట్లు దన కసి దీర్చికొనుచుండును. పాపము'

'నా పైకి డిల్లీ సైన్యములు దరలినవి. అవి నాపూర్వ వైరి యగు 'ఖాజజహా' యాధిపత్యముననే నడచి వచ్చెను. మా యిర్వురకు గోదావరీ ప్రాంతములందు భయంకరమైన యుద్ధము జరగెను. నే నెంతయో పరాక్రమమునుఁ జూపితిని. కాని నా విక్రమము వ్యర్థమై పోయినది. జయలక్ష్మి నా విరోధినే వరించినది.'

'నిజమే! దైవము తోడ్పాటు లేని పురుష కారము నూనె లేని దీపము వంటిది.'

'వాఁడు 'సాగరు' ప్రాంతముల నాక్రమించు కొన్నాఁడు. నే నా పరిసరముల నిలచుట గష్ట మయ్యెను. కఠోర ప్రయాసలతో, భార్యా పుత్రుల వెంట నిడికొని యీ దేశమునకుఁ దరలి వచ్చితిని. వాని సైన్యములు నావెంటనే దరుముకొని వచ్చుచున్నవి. మిమ్ము శరణు వేడి మీ ప్రాపున జీవించు నూహతో, నింత దూరము బరువిడి వచ్చి నాను. ఆ పైని మీ దయ. నా పుణ్యము.'

హఠాత్తుగ జంబుకేశ్వరుని హృదయము గంభీరతా ముద్రను ధరించెను. అంతవరకు వెంట వెంటనే సమాధా నము లిచ్చుచున్న మహారాజు - దానికి సమాధాన మొసఁ గక గొంతసే పాగెను.

'బహాదుర్దీను' మనసు వివిధములైన యాలోచనలతో, సందర్భ శుద్ధిలేని శబ్ద ప్రయోగమువలె నైనది. తన యాలోచనలో మునిఁగి యున్న జంబుకేశ్వరుఁ డొకవైపు— బహాదుర్దీనుని వేదన గమనించుచునే యుండెను. కడకు మహారా జన్నాఁడు. 'నాయనా! పరిపరి రీతుల బాధ పడ కుము. కానున్నది కాక మానదు. అట్లని యెఱిఁగి దానిని ధైర్యముగ సహించుటయే విజ్ఞుఁడైన ధీరుని లక్షణము. ఆపత్కాలమున నన్ను దలఁచితివి. కానిమ్ము. నీవొక మానవుఁడవై నన్ను శరణు జొచ్చితివి. నే నొక మాన వుఁడనై నిన్ను రక్షింతును. రాచరికమున కంటె మాన వత్వము గొప్పది. పొమ్ము! ఇక విశ్రమింపుము!!'

'బహాదుద్దీన్' లేచి వినయమున వంగి - నమస్కరించి నాఁడు. ఆతని యంతః పురకాంతలకు రాజమర్యాదల కను వైన చోటున నివాస మేర్పరుపఁబడెను. జంబుకేశ్వరుని యనుచరవర్గము 'బహాదుద్దీను'ను - నాతని కుటుంబమును గంటికి రెప్పవలెఁ గాపాడ జొచ్చినారు.

ప్రొద్దు వాటారెను. జంబుకేశ్వర మహారాజు గొలువు కూటమునకు వచ్చెను. సరదారులతోఁ గొలువు గిక్కిరిసి పోవుచున్నది. ఒకవైపు గూర్చున్న వారు 'కోసిగి' రాజులు, మఱియొక వైపున కర్ణాటము నుండి వచ్చిన గౌడు లధి వసించి యుండిరి. ఇంకొక వైపున యుపవసించినవారు 'దోరవాడి' సంస్థానాధిపతులు. నడుమ రత్నస్థగితమైన సింహాసనము వెలుగొందు చుండెను. దాని కిఱు వైపుల నిర్వురు వందులు నిలచి కొన్నారు. వారి ముఖములు స్వామి భక్తిచేఁ దొణికిసలాడు చుండెను. ఆ సింహాసనము నెదుటఁ గొన్ని యుత్తమమ్ములైన గద్దెలున్నవి. వానిపై నష్టమంత్రులు గూర్చుందురు. వానికి వెనుకల మఱిగొన్ని గలవు. వానిపై నధివసించువారు దండనాథులు - సామం తులు మున్నగువారు. రాజున కెదురుగ నున్న యాసనము నందు 'హరియప్ప' గూర్చున్నాఁడు. అతఁ డొక మంత్రి. అతఁడే భావి విజయనగర సామ్రాజ్యమున గాబోవు వీర 'హరిహరరాయలు.' ఆతని ప్రక్కనే 'బుక్కభూపతి' యధివ సించి యుండెను. వీ రిర్వురును-జంబుకేశ్వరునకు మంత్రులే.

కంప భూపతి సేనాధ్యక్షుల స్థానమున గూర్చున్నాడు. అతఁడు ప్రసిద్ధుఁడైన దండనాయకుఁడు. అతని కిరువైపుల నాతని జిఱుతమ్ముఁలు మారన దండనాయకుఁడు - ముద్దన్న ధన్నాయకుఁడు - నధివసించి యుండిరి. సభయం దాసీను లైనవారి మొగములపై నెల్ల నేదో యొక యుత్కంఠ. కొందఱి ముఖములు మ్లానములై యుండినవి. మఱి కొందఱి ముఖము లేభావమునుగూడ సూచించుట లేదు. కాని - దేనినో దెలిసికొన బోవలెనను తహతహ యందఱకును గద్దు. హరిహర బుక్కభూపతు లేమో దమలో గుజగుజలు వోవుచుండిరి. అవి వారిర్వురికి మాత్రమే వినఁబడు చుండెను.

హరిహర బుక్కభూపతుల యునికిని గుఱించి చరిత్రకారు లందఱకును సందేహమే. కొందఱు వారు బల్లాళ రాజులకడ నుండిరని దెల్పుదురు. మఱికొంద ఱా యన్నదమ్ములు - రెండవ ప్రతాపరుద్రునికడఁ గోశాధ్యక్షులుగ నుండిరనియు - కాకతి సామ్రాజ్యము నాశనమైన పిదప - వారు గంపిలి రాయనితోడ జేరి రనియు - నిర్ణయించిరి. ఇక గొందఱు- వీరు స్థానికముగ నానెగొందెలో నున్న 'కురవ' లనియు- విద్యారణ్యుల యనుగ్రముచే వీరికి శుక్రయోగము బట్టెననియుఁ దెల్పుదురు. ఇక గొందఱు- వీరు- 'దేవగిరి' యాదవుల సంతతికి జెందినవా రనియు ననిరి. కొందఱు వీరిని 'కదంబు' లందురు. జంబుకేశ్వరునకు వీరు

బంధువులగుటచే నాతనికడ బ్రధానస్థానములలో నుండిరట ఇంతకును - వీరి విషయ 'మిదమిత్థమ'ని తేల్చి చెప్పిన చరిత్ర కారుఁ డెవ్వఁడును లేఁడు. కొందరు జంబుకేశ్వరుని చరిత్రమే గల్పన యందురు. కంపిలి రాయఁ డను వాఁడు వేఱొక వ్యక్తియని వారి యూహ. మూఁడవ బల్లాలునకు- ఢిల్లీ సుల్తానునకు జరిగిన యుద్ధములలో 'హరియప్ప' ధనాధ్యక్షుఁ డొకఁ డున్నాఁడు. అతఁడే హరిహరుఁడని 'శాలిటోర్' మొదలైన చరిత్రకారు లనిరి. కాని యతఁడే యితఁ డనుట కేమి ప్రమాణము? 'హరియప్ప' యను పేరా నాఁడు గర్ణాటమున సామాన్యము. అనేకు లుంచికొనుచుండిన నామధేయము. ఇంతకును - చారిత్రకు లెవ్వరును - నీ విషయమున నొక కొలికికి వచ్చినవారు గారు. ఒక్కొక్కరి దొక్కొక్క త్రోవ. హంపి ప్రాంతములలో - జంబుకేశ్వరుఁడు కుంతల దేశమును బరిపాలించెనని కథలున్నవి. 'కుమారరామన చరితె' యను కర్ణాటక గ్రంథముగూడ దీని కుపస్ఫోరకము. 'సాండూరు' కొండలలో జంబుకేశ్వరుని యాలయము గలదు. అందులోని మూర్తి యా మహారాజేననియు - నారాజు శివావతారుఁ డనియు జనులు జెప్పెదరు. ఆ 'సాండూరు' కొండలలోనే కుమారస్వామి యాలయ మొకటి యున్నది. అది నేటికిని జాల ప్రసిద్ధమైనది. పతి సంవత్సరమును విశేషముగ జాతర జరగును. ఆ చోటిలో విభూతి భూగర్భమున దయ్యారై దొరకునట!

ఆ దేవుని దర్శనమునకు నేటికిని స్త్రీలు పోరాదు. జంబుకేశ్వరుని కాలమున నట నేదియో యొక వృత్తాంతము జరగెననియు - నప్పటినుండియు స్త్రీ లా దేవుని దర్శనమునకుఁ బోరనియు నొక గాథ ప్రచారములో నున్నది. కొన్ని విషయములందుఁ జారిత్రకుల హేతువాదములకన్నను - నిట్టి కథల ననుసరించుటయే క్షేమకరముగఁ దోచును. వానిలోనే సత్య మెక్కువగ నుండు ననిపించును.

గాలియందుఁ దెరలు తెరలై శంఖధ్వనులు వ్యాపించినవి. ఆధ్వనులు - మహారాజు గొల్వుకూటమునకు బయలుదేరినందుకు గుర్తు. ఆనాఁడు జంబుకేశ్వరుఁ డొక హయముపై నధివసించెను. ఆ ఘోట్రాణము రుచిరాభరణముల చేతను- పుష్పములచేతను నలంకృతమై యుండెను. దానిపై సమర్పఁబడిన యాసనము శ్వేతచ్ఛత్రాలంకృతము. జంబుకేశ్వరుఁడు గుఱ్ఱము నెక్కెను. ఆ గుఱ్ఱము వెనుక నేడు వెలిగొడుగులు వరుసగ వచ్చినవి. ఆ గుఱ్ఱమునకు ముందుఁ గొందఱు సరదారులు విచ్చు కత్తులతో నడచిరి. మధ్యాహ్నపు టెండల కా కత్తులు తళతళ లాడు చుండెను. రాజు గొల్వుకూటపు హజారమును సమీపించి నంతనే- ససంభ్రముగ 'హరియప్ప' యెదురు నడచినాఁడు. ఆతని వెంటనే 'బుక్కరాయఁడు' మహామంత్రుల కేలందికొని జంబుకేశ్వరుఁడు హయమును దిగెను. ఆ మువ్వురు నేకార్థపరములైన త్రికరణముల వలెఁ గొల్వుకూటమునకు నడచినారు. జంబు

కేశ్వరుఁడు గోల్కొండకూటమును బ్రవేశించిన దే తడవు- సభ యంతయు దిగ్గున లేచెను. 'కంపిలిరాయఁ' డధివసించిన వెనుక నందఱు గూర్చున్నారు. ఇర్వురు యువతు లామహారాజు కిఱువైపుల నిలచి చామరలు వేయుచుండిరి. నిముసములో సభ యంతయు సద్దుమణిగినది.

ముసలి హర్యక్షమువంటి 'కంపిలిరాయఁడు' సభ నంతయుఁ గలయఁ జూచెను. ఆ చూపులలో నీ నా డేదో యొక క్రొత్త భావముండెను. ప్రకృతి శీతలములైన యా మహారాజు చూపులు పైని బడిన వాఁ డెల్ల నాదరముతో నీరై పోయెను. జంబుకేశ్వరుఁ డన్నచో నాజనుల కంతటి యభిమానము! సభను గలయఁజూచిన మహారా జొకసారి యష్టమంత్రులను సాభిప్రాయముగఁ బరికించినాఁడు. ఆ చూపు లందుకొని హరియప్ప మహారాజులకు మనవి జేసెను.

'ప్రభూ ఏలిక వా రేమో సభ కానవెట్టు దలచిన ట్లున్నది!' మహారాజులు దలపంకించిరి. 'ఔను! హరియప్ప మంత్రీ! నేడు ధర్మము మనలను బిలుచుచున్నది. ధర్మ మెక్కడో- సామ్రాజ్య సుఖము లెక్కడో దూచికొనవలసిన సమయము వచ్చెను' మహారా జీ మాట లను నంతలో హరియప్ప దన తమ్ముఁడు బుక్కభూపతి వైపొకసారి జూచెను. ఆ చూపుల కర్థము ? 'మహారాజులు జెప్పఁబోవు విషయము మన మింతకుముం దనుకొన్న దే' నని; హరియప్ప వినతుఁడై మహారాజులకు బదు లొసఁగినాఁడు.

'తరతమములు వింగడించుకొను భారము శివావతా రులైన జంబుకేశ్వరులదే. తమ యానతి శిరస్సుపై ధరించి తమరు బోయిన మార్గమున నడచి వచ్చుటయే-భృత్యులైన మా బోంట్లకు దెలిసినది.'

సభ యంతయు నొక్కసారి 'యవు నవు న'న్నది. అనేక శిరస్సులు బంకింపఁబడెను. అపు డా సభ- ప్రాత ర్మందానిలోద్ధూతమైన కమలాకరము వలె భాసించెను. ఆ భాసించుటయు క్షణకాలము మాత్రమే! ఆ వేయి తుమ్మె దల ఝుంకారమును క్షణకాలమే! జంబుకేశ్వరులు- బలుక నారంభించినారు. 'నే జెప్పబోవు విషయ మింతకుముందే నా యష్టమంత్రులకు దెలిసి యుండును. వా రందఱు జార చక్షు వులు గదా '

బుక్క భూపతి యన్నాఁడు. 'నిజముగ కా వార్త జార ముఖమున నింతకుముందే వింటిమి. కాని- మహారాజుల ముఖమునుండి మఱల వినవలయునని యష్టమంత్రుల యాశ.'

మహారాజు లేమో నిట్టూర్చిన ట్లుండెను. నిట్టూ ర్పేలరాదు? రాజ్యపాలనమునందు సుఖమేగాదు. దుఃఖము గూడ నుండును. స్వహస్తధృత దండమైన యాతపత్రము నందువలె! ఒక్కొక్కసారి రాజులు భయంకరములైన త్యాగములు జేయవలసి వచ్చును. ఇవి యన్నియు- రాజ పదమును సార్థకము జేయదలఁచుకొన్నప్పుడే.

జంబుకేశ్వరు లన్నారు. 'ఢిల్లీ సుల్తాను తుగ్లకునకు - 'బహాదుద్దీన్' మేనల్లుడు. అతఁడు దక్షిణాపథములోని 'సాగర్' సామంతుఁడు. కారణాంతరములతో నాతఁడు చక్రవర్తికిఁ దిరుగఁ బడినాఁడు. సుల్తాను సైన్యము లాతనిపైఁ గవిసెను. ఆ బహాదుద్దీను శరణార్థియై కుంతలమునకు వచ్చినాఁడు. అతఁడు దారాపుత్రులతోఁ దరలి వచ్చెను. బహాదుద్దీనును రక్షించవలసిన బాధ్యత విరూపాక్షుఁడు నాపై నుంచినాఁడు. నే నాతనిని రక్షింతునంటిని. నా యాడిన మాటకుఁ దిరుగులేదు. బహాదుద్దీనునకుఁ బ్రతిజ్ఞ సేయుటకుముందు నే నష్టమంత్రులను విచారింపవలసి యుండెను. కాని - హేతువాదములతో ధర్మమున కనేకములు రంగులు మారిపోవును. హేతువాదములకంటెను- ధర్మాధర్మ నిర్ణయమునం దంతః కరణ ప్రవృత్తి పరమ ప్రమాణ మనుకొందును.'

మహారాజులు క్షణకాల మాగిరి. ఆగిన వెంటనే కంప భూపతి 'నిజమే' యని మహారాజులకు సమాధాన మిచ్చినాడు. కంపరాజు సర్వ సేనాధిపతి. మారన ముద్దన్న లాతని యనుంగుఁ దమ్ములు. కంప భూపతి వీర బుక్కని సోదరుఁడు. పంచ పాండవులవలె నా యన్నదమ్ము లేవురు.

సమాధానమునకై మహారాజు బుక్కభూపతివైపుఁ జూచినట్లుండెను. బుక్కరాజు లేచినాడు. 'మహారాజా మీ రన్నమాట నిజమే! శరణాగత రక్షణము దొడ్డ ధర్మము. కాని ధర్మము ధర్మమాత్రముననే యుపాదేయము గాదను

కొందును. ఒకొక్కసారి యధర్మము ధర్మమై భాసించును. దేశకాల పాత్రములను బట్టియే ధర్మా ధర్మ నిర్ణయములు జరుగవలె. ఆ ధర్మము లందును, దరతమ భావము లున్నవి. దేవర నన్ను క్షమించినచో, శరణాగతరక్షణము మీ వైయక్తికి ధర్మము. ప్రజారక్షణము మీ రాజ ధర్మము. రాజ ధర్మమును నిర్వర్తింపవలసి వచ్చినప్పుడు, వైయక్తిక ధర్మము గుణీభూతమై పోవును. పోవలెను కూడ. జంబుకేశ్వరు లేనాడు సింహాసన మధిష్ఠించిరో నాటినుండి వారు - కేవలము - మహారాజులు మాత్రమే! అందుకుమించి వైయక్తికముగు నాత్మ వారి కుండకూడదు.'

'హరిబుక్కుడు' బైమాట లనుచున్నప్పుడు జంబుకేశ్వరుడు శిరస్సు నెత్తనే లేదు. తల వంచుకొనియే వారు 'బుక్కరాయా! నీ వన్నది ధర్మమే! కాని—' యని నిలిపిరి.

ఈ యవకాశములో ముద్దన్న ధన్నాయకుఁడు లేచెను. 'సామ్రాజ్యాధిపతీ! నన్ను మీరు మన్నింపవలెను. మీరు సింహాసనస్థులై యున్నచో, ననేక జనుల ధర్మములు రక్షింపఁబడును. ఆ పుణ్యమంతయు పోదే ఒక వ్యక్తిని రక్షించుటకై యింతమంది ప్రజల ధర్మములను ధ్వంసీకరించుట—'

'హరియప్ప' లేచినాఁడు. 'ముద్ద భూపతీ! నీ వాడు వాక్యములు మహారాజుల కర్థమైనవి. ఇక కూర్చొనవచ్చును'

హరియప్ప యీమాట లనుట మ్లానమైన మహారాజుల ముఖమును గమనించి—

తిన్నగా జంబుకేశ్వరుఁ డనెను. 'మీ రిప్పుడు వచించిన పలుకులు సత్యములే! రాజునకుఁ బ్రజాహృదయమునకంటెను భిన్నమైన యాత్మలేదు. కాని- యొకానొకఁడు రాజ ధర్మముతోఁబాటు వైయక్తిక ధర్మమునుగూడ సమగ్రముగ నిర్వహింపఁ గలిగినచో నది మరింత శోభావహము గదా! ఈ రెంటికిని మీ రనుకొన్నంత విరోధమున్నదా!'

హరియప్ప యనెను. 'లేదు. లేదు. రాజధర్మ మను పుష్పమునకు వైయక్తికధర్మ మనునది వృంతము వంటిది.'

బుక్క- భూపతి గొంచె మావేశితుఁడయ్యెను. ఆతఁ డన్నాఁడు. 'మహారాజా బహదుర్ఖానును రక్షించు తలఁపుతో మన మిప్పుడు శత్రుత్వము గట్టుకొన్నది ఢిల్లీసుల్తానుతో. వారు సర్వసామాగ్రియు సమగ్రముగ గలవారు. 'దేవగిరి- యోరుగల్లు' వంటి పట్టణములే వారిధాటికి నిలువలేక పోయినవి. మన కంత సైన్య సంపత్తిలేదు. ఒకని కారణమునకై యంతవారితో మనకు విరోధముగట్టికొనుట- నాకు సముచితముగ గన్పడలేదు' ఒకానొక 'కోసిగి' సామంతుఁడు లేచెను. 'ఇంతకును బుక్కభూపతులు వచించునదేమో! యుద్ధమున జయము మనకు సిద్ధింప దనియా! కుంతల దేశమున గొండలు పిండికొట్టగల మహావీరులున్నారు. కుంత

లను గొడ్డుబోలేదు. పూర్వ మీ దేశమునందలి కపులు రావ ణునివంటి యుద్రగుని జయించిరి.'

బుక్కభూపతి మరేమియు మాటలాడలేదు. ఆతని యాపాదమస్తకము వణఁకుచుండెను. ఒఱనుండి కాలభుజం గమువంటి కత్తినిబెరికి బుక్కభూపతి రెండుచేతులలో నడ్డ ముగ బట్టుకొని 'మహారాజా యుద్ధమునకు నేను భయపడి తినని సరదారులు భ్రాంతి పడుచున్నారు. నా మేన ప్రాణము లుండువరకుఁ బట్టిన కత్తి విడువక మీకై యుద్ధ మొనర్తును. మఱి యింతకన్నను నే నేమియుఁ జెప్పలేను.' వీరబుక్కని కంఠము క్రోధావేశములతో గద్గదమైనది. ఆతని కన్నులనుండి 'చిట పట' ధ్వనులతో మిణుగురులు వెలికి వచ్చినట్లే యుండెను. హరియప్ప తమ్మునకు రహస్య ముగఁ 'గూర్చొనుమని' సైగ జేసినాఁడు. బుక్కభూపతి యన్న యానతితో గూర్చుండెను. జంబుకేశ్వరుఁడు హరి యప్పవైపు జూచెను. హరిహరుఁడు లేచి 'మహారాజా యుద్ధమునకుఁ దమరు సిద్ధమైనచో మేమును మీ వెంట నడచి వచ్చుట తథ్యము.'

సేనాధ్యక్షుఁడు కంపభూపతిలేచి హరిహరుని మాట లనే యనువదించినాడు. మారన్నయు, ముద్దన్న ధన్నాయ కుఁడును, 'మేమును నంతే' ననిరి. ఈ మాటలతో క్షణి కోత్సాహము రేగిన సభయంతయు 'మేము నంతే' యని గత్తులెత్తెఁ జేయివేసినారు.

తన యనుయాయుల రాజభక్తికి జంబుకేశ్వరునకు సంతోష మైనదేగాని, యా మనస్సులోనే - శాంతి లేదు. కొంతసేపటికి జంబుకేశ్వరుఁడు సభనుండి లేచెను.

ఇంతలో సాయంకాల మైనది. తుంగభద్రాదేవి రక్తాంబరమును ధరించెను. పక్షులు నిన్నటి వలెనే నేఁడును మూల్గినట్లుగాఁ గూసినవి. మహారాజు దినమును వలెనే విరూపాక్షుని దర్శనమునకైఁ బోయెను. నమస్కరించి నిలువఁబడిన జంబుకేశ్వరునకు, భూషణముల మాటున విరూపాక్షుని మూర్తిలో మూఁడవ కన్ను గనపడిన ట్లయ్యెను. దానిని గమనించులోన నది మరి గన్పడలేదు.

మరి మూఁడురోజులు గడచెను. 'బహదుద్దీను' జంబుకేశ్వరుని శరణు జొచ్చిన సమాచారము, ఢిల్లీసుల్తాను సేనల కధ్యక్షుఁడైన 'ఖాజజహా'కుఁ దెలిసినది. అతఁడు 'బహదుద్దీను'ను దనకుఁ బట్టి యివ్వవలసినదనియు, లేకున్న నానె గొందిపైకి దాడివత్తు ననియు జంబుకేశ్వరునకు వర్తమాన మంపినాఁడు. వచ్చిన దురుష్కరాయబారిని 'కంపిలిరాయఁ' డర్హసత్కారములతో, నాదరించెను. 'బహదుద్దీను ద్రోహి యనియు, నాతనిని బట్టి యివ్వవలసిన దని'యుఁ దురుష్కరాయబారి దెలిపెను. దానికి జంబుకేశ్వరుఁ డొసఁగిన దొకటే యుత్తరము 'అతఁ డింతకుముం దేమైన నగుగాక, శరణార్థియై నాకడకు వచ్చెను. నేను ద్రికరణశుద్ధిగ నాతని కభయ మివ్వఁదలంచితిని. ఇఁక దీనికిఁ దిరుగు లేదు.' ఎన్ని

రీతులనో జంబుకేశ్వరునకు రాయబారి హితము బోధింపఁ జొచ్చెను. అతఁ డేమిఁ జెప్పినను, నే యాశలు జూపించినను, జంబుకేశ్వర మహారాజు మనస్సు మరలినది గాదు. యుద్ధము నకుఁ దయారు గావలసిన దని యా రాయబారి వెనుకకు మరలినాఁడు. జంబుకేశ్వరుని యధికారులు ఢిల్లీ రాయబారిని దమ సరిహద్దులు దాటిపోవు నఱకును మర్యాదగ సాఁగ నంపిరి.

రాయబారి 'ఖాజజహా' కడఁ జేరెను. ఆ సేనాధ్యక్షుఁడు సైన్యములను గైకొని యానెగొందిపైకి దాడిఁ వెట్టినాడు.

రాయబారి వెడలిన తడవు 'యానెగొంది'లో యుద్ధ సన్నాహము లారంభమైనవి. సామంతరాజ్యముల నుండి సైన్యము లంచెలపైన వచ్చిచేరెను. కర్ణాటక ప్రాంతముల నుండి గాఁడులు 'చిచ్చైనను బుడిసిలింతు' మని పంతము లాడుచు బరతెంచిరి. ఆరవీటి బుక్కరాజు జంబుకేశ్వరు నకు హితుఁడు. కంపిలిరాయనికిఁ దోడుగ నీతఁడు గొన్ని సైన్యముల నంపెను. కుంతలదేశము నందలి సైన్యము లే కృతములైనవి. వీర కంపన భూపాలుఁడు జంబుకేశ్వరుని సైన్యములకు సేనాధిపతి యైనాడు.

'ఖాజజహా' సైన్యసమేతుఁడై గదలి వచ్చుచున్నా డని చారులు మహారాజునకు వార్తలు దెచ్చిరి. ఆ విషయము దెలియుటయే తడవు గుంతలసైన్యములు ఢిల్లీవాహిని కెదురు

నడచెను. రెండు సేనలును 'దొరవాడి' వద్ద సంధించినవి. కంప సేనాని తన సైన్యము నైదుభాగములు గావించినాడు. ఈ యైదు భాగములకును నాయకు లా యైదుగు రన్న దమ్ములే ఒక్కొక్క డొక్కొక్క భాగమును నడపెను. మారన ముద్దన్న దండనాయకులు, సైన్యములు గైకొని, జుట్టు మార్గములలో 'దొరవాడి' కుత్తరముగఁ దరలినారు. హరిహర బుక్కరాయ లిద్దరును దమ సైన్యములతో 'ఖాజజహా' నెదిరించిరి. కంప భూపతి పడమటి దిక్కునుండి శత్రువులను దాకెను. దురుష్క సైన్యములు, నడుమ నిరుకు కొన్నవి. మూఁడు వైపులను శత్రువు లాక్రమించినారు. ఏ వైపునను దప్పించుకొని పోవుటకు, వీలులేదు. సైన్యము నకుఁ దూర్పు వైపున నిండుగఁ బారు తుంగభద్ర. నాటి యుద్ధమునందు ఢిల్లీ సైన్యములు గగ్గోలుపడి పోయెను. వారి కేమిసేయుటకు దిక్కు దోచినదిగాదు. కుంతలసైన్యములు, వీర హుంకారములతోఁ బైపైని దూకుచుండెను. అశ్వికులు దమ కంభాణముల రింఖలు శత్రువుల నిటాలములకు దగులునట్లు, పైపైని దాటించుచుండిరి. నడ గొండలవంటి యేన్గు లుత్తాల సముద్ర తరంగములవలెఁ బైపైని బడు చుండెను. వీని యన్నిటికిఁ దోడు జుట్టుపట్టుల నున్న కొండల నుండి 'రివ్వు - రివ్వు' మని వచ్చు లక్ష్యభేదన చణములైన శరములు ! తలలను బగిలించు నొడిసెల రాళ్ళు ! ఆనాఁడు ఢిల్లీ సైన్యమునకుఁ 'గుంతల దేశమన నిట్టి' దని దెలిసినది.

వారిం బారిపోవుటకుం గూడం దెరువు లేదు. సేనాధిపతు లవ్రక పరాక్రమములై విజృంభించి తురుష్కులను దను కత్తికిం గండగాం జెక్కివేసిరి. ఈ రగడలోం దురుష్క సేనాపతి 'ఖాజజహా' జెప్పకయేం బరుగు దీసినాండు. వాండు 'దేవగిరిం' జేరువరకు నిలచిన వాండు గాండు. జయలక్ష్మి మదదిష్ఠులైన 'యానెగొంది' సరదారులు వీరావేశములతో వెనుకకు మరలిరి. 'బహాదుద్దీను'న వార్తలు దెలుపం బడెను. 'ఇంక బ్రతికితినిలె మ్మ'ను కొన్నాండు.

నాటి ప్రదోష పూజకు జంబుకేశ్వరుండు విరూపాక్షాలయమునకు వచ్చెను. అతండు మూర్తీభవించిన ధర్మము వలె, రూపుగొన్న మానవత్వమువలె, మానవుండైన కరుణా రసమువలె నడచి వచ్చెను. ఆనాటి విజయముతో నాతని హృదయమున బొంగు లేదు. మానవ చరిత్రపైననే జంబుకేశ్వరున కేదియో యొక ఘృణ

సాక్షాద్విరూపాక్షుండే యైన యర్చకుండు మహారాజున కారతిచ్చినాడు. ఆరతి దెచ్చినదే తడవు దానిని కన్నులకద్ది కొనులోననే 'గప్పు' మని యా దీప మారిపోయినది. జంబుకేశ్వరుండు క్షణముం జకితుండయ్యెను. అర్చకుని రెండు కన్నులును విరూపాక్షుని మూర్తిపైం గేంద్రీకరింపంబడి యుండెను. రాజుం గూడం బంపాపతి వైపుం జూచెను. విరూపాక్షుని విగ్రహము 'ఫక్కు'మని నవ్వినటు లయ్యెను. ఆ విరూపాక్షుని నవ్వు- నాండు- ప్రసన్నముగ గాక యేవో వికి

టముగ నుండెను. ఆ నగవుల కాంతి యాలయ మెల్ల నాక్ర
మించెను. ఆక్రమించినటు లయ్యెను. అది విరూపాక్షుని వికట
టాట్టహాసకాంతియో వెలుంగుచున్న దీపముల కాంతియో
వింగడించుకొనుపాటి తెలివి యైన నా పరిచారకులకు లేదు.
అంతలో నా హాసరోచి మాయమైనది. నానాలంకారముల
వెనుకనుండి జంబుకేశ్వరునకు విరూపాక్షుని మూండవ కన్ను
గనపడెను. ఈ నా డాకన్ను మరింత స్పష్టముగ గనుపడ్డది.
నాండు జంబుకేశ్వరుండది శివుని మూండవ కన్నుగ గమనిం
చెను. నేండు దనకు యుద్ధమున జయ మైనది. మరి కర్పూర
హారతి యేల యారిపోవలె? శివుని మూండవ క న్నేల గన్ప
డవలె? ఆ చిచ్చుఱ కంటిమంటలు నేండు శాత్రవులను
దహించిన వనియా లేక యాచిచ్చుఱ కన్ను భావి యమంగ
ళమును సూచించునా? మహారాజుల కర్థము గాలేదు. దేవ
తలు బరోక్ష ప్రియులు. వా రొసంగు సూచన లిట్లే యనేక
వ్యాఖ్యానముల కాకరములై యుండును. జంబుకేశ్వరుండు
దన హృదయమున దనుకొన్నాండు. 'ఓయీ! విరూపాక్షా!
జనన మరణములు, జయాప జయములు నవస్థాభేదములే!
వానికి స్వభావతః మంచియు లేదు. చెడుగు లేదు. మానవుండు
వానికి మంచి చెడుగుల నారోపించును. అది వాని దౌర్బ
ల్యము. సుఖదుఃఖములు, జయ పరాజయము లన్నియు నీ
లీలలే! అనంతమగు నీ విశ్వలీలలలో నా కే పాత్ర నిచ్చినను

సమ్మతమే. కర్మ మొనర్చుటయే నా విధి. నీ యిచ్ఛయే సాఁగు గాక !'

ఈ రీతి భావించుచునే - జంబుకేశ్వరుఁడు విరూపాక్షునకు నమస్కరించి యంతఃపురమునకు వెడలిపోయెను.

పారిపోయిన 'ఖాజజహా' క్రొత్తసైన్యమును గూర్చుకొన్నాఁడు. వాఁడు మఱల రెండవసారి యానెగొందిపై దండెత్తెను. ఈసారి వాని ప్రయాణము పరమగోప్యముగ నుంచఁబడినది. రాత్రులు రాత్రులందే సైన్యములు ప్రయాణించెను. దినములందే యడవి సందులలోనో సైనికులు బస సేయుచుందురు. అయిననేమి ? కుంతలదేశపు సీమలలో శత్రుసైన్యము లడుగు బెట్టెనో లేదో - యావార్తలు వేగరులకు దెలియనే తెలిసినవి. కుంతలదేశములోని చారచక్షువు లంత సమర్థులు. వాఁడీ సారి గంపిలిపై బడినాఁడు. ఆనెగొంది సైన్యము లంతకు ముందే యుద్ధమునకుఁ దయారుగ నుండెను. ఈసారి బహుళ పరాక్రమమును బ్రదర్శించిన వీరులు గాఁడులు, జంబుకేశ్వరుని సైన్యములు- విరూపాక్షుఁడు పట్టిన త్రిశూలమువలె మూఁడు పాయలై నడచినవి. తురుష్కసైన్యములు చక్రవ్యూహముగ నడచుచుండెను. నాటి యశ్వసాహిణ ముద్దన ధన్నాయకుఁడు. ఈ యుద్ధమున సర్వసేనాధీశుఁడై సేనల నడిపినది యతఁడే. ఆశ్వికసైన్యము ముందుగా శత్రుసేనల జించికొని పోయినది. ఆ గుఱ్ఱములు మెఱపుల కన్నలు. నిముసములో నది గాలివలె దౌడు

దీయును. తుఫానువలె పైఁబడును. పిట్టలవలె నెగురును. ఇక సశ్వములపైనున్న రాహుత్తు లందమా - ఒకసారి దివిసిన యా కత్తికిఁ బదితలలైనను బడవలసినదే! తురుష్క వీరులు గూడ బిశాచములవలె నిలచిపోరిరి. ప్రాంతారణ్యముల నుండి శరములు బైకి వచ్చుచుండెను. అవి సరిగ శత్రువులనే దాకును. వాని కా వింగడిం పెట్లు దెలియునో ఆ చమత్కారము వానిని బ్రయోగించు ధానుష్కులది. దూరము నుండి బడు యొడిసెలరాళ్ళతో శత్రువుల కపాలములు బగులుచుండెను. ఆ యొడిసెలరాళ్ళకుఁ గూడ శరములకు వలెనే, దా మెవరిని దాకవలెనో దెలియునా? అవియు సరిగ శత్రువులనే దాకుచుండెడివి. ఇంతకును- నీ రెంటితో - బ్రాంతారణ్యములనుండి యుద్ధమొనర్చుచున్న వారు ప్రజలు. కుంతలదేశ రాజుపై, నా జనుల కంత మక్కువ! శత్రువులను సైన్యములే గాక సామాన్యప్రజలే యెదురింతురు. కుంతల దేశవాసులకు ధనుఃపాండిత్య మెక్కువ. కాకతీయులకడ బని చేసిన నవలక్ష ధనుర్ధరు లీ ప్రాంతముల వారే! విజయనగర చరిత్రలో నీ ధానుష్కులు గావించిన సేవ గొప్పది. ఆ జనులు- నేటికి, నీ సీమలో నున్నారు. వారు జాతితో బోయలు. వారికి నేటికి నీ ప్రాంతములలో 'గుఱికాండ్ర'ని పేరు. ఒడిసెలరాళ్ళను బ్రయోగించెడు వా రుప్పరవారు. వారు మొన్న మొన్నటి వరకు - యుద్ధములు లేనందుచే, నాకౌశలమును దారిదోపిడులలో వెచ్చించుచుండిరి.

ఈ సారి గూడ 'ఖాజజహా' కోటమిఁ దప్పినది గాదు. వాఁడుఁ దిన్నగా 'దేవగిరిఁ' జేరుకొన్నాఁడు. తన సైన్య ములలోఁ జాలభాగము నశించినది. మూఁడవసారి జంబుకే శ్వరునిపై దండెత్తుటకుఁ దగిన సామగ్రిలేదు. ఖాజజహా యీవిషయము లన్నియు, ఢిల్లీ సుల్తాను తుగ్లకునకు జారుల మూలమునఁ జెప్పిపంపెను. తుగ్లకు క్రోధావేశముతో నొడలు మరచెను. ఆతని కింతకుముందే యానెగొందిపైఁ గన్నుండెను దాని కిదియొక సాకయినది. పైగా రెండు సారులు ఖాజజహా సైన్యములను వెనుకకు దరుమగొట్టుట, జంబుకేశ్వరుఁడు దనకొసర్చిన మహాపరాధముగఁ జక్రవర్తి భావించెను. వెంటనే యసంఖ్య సైన్యములతో నాతఁడు గదలినాఁడు. లక్షలకుఁ గాల్బలములు బయాణించెను. అశ్వ సైన్యములు నలుబదివేలు గదలెను. నడగొండలవంటి గజ ములు వేయి; చక్రవర్తి సైన్యములతో మెఱపు మెరసినట్లు 'దేవగిరి' చేరినాఁడు. జంబుకేశ్వరునిపైని ద్వేషమును ఖాజ జహాఁ జక్రవర్తికిఁ గావలసినంత నూరిపోసెను. ఆ బోధ లతో మొదలే మహావేశియైన తుగ్లకు దిమ్మఁ దిరిగినాఁడు. తుగ్లకే స్వయముగ సేనాధిపతియై సైన్యముల నడపెను. ఆ యసంఖ్య సేనావాహిని నడచునప్పుడు భూమిగడగడలాడెను. ఆదిశేషుని ఫణములు వీలునేమో యనిపించెను. సైన్య ములు 'దొరవాడిఁ' జేరినవి. జంబుకేశ్వరుని సైన్యములు తుగ్లకు సేనావాహిని నడ్డెను. కాని సముద్రమును బడవచే

లంఘించుటకు సాధ్యమగునా ? పే రెన్నసిన నాయకు లెందరో యుద్ధమున జచ్చిరి. 'దొరవాడి' చక్రవర్తికి దొరకిపోయెను. వెంటనే యాతఁడు హుటాహుటి 'గంపిలిఁ' బట్టెను. కను రెప్పపాటులో 'గంపిలి' స్వాధీనమైనది. ఈ చక్రవర్తికి రెండు కోటలను సాధించుటకుఁ బట్టినది రెండు దినములు మాత్రమే! ఈ రెండునాళ్ళును, జంబుకేశ్వరుఁడు విరూపాక్షుని దర్శన మునకు దినమునువలెనే బోయెను. తుంగభద్రాదేవి యీ రెండు దినములందుఁ గూడ భయంకరమైన రక్తాంబరమునే ధరించెను. ఒడలంతయు నలంకరింపఁబడిన విరూపాక్షుని యందు- మూఁడవకన్ను యీరెండురోజులును, జంబుకేశ్వ రునకు మరింత స్పష్టముగ దర్శనమిచ్చెను. 'కంపిలికోట' బడిననాఁ డా బచ్చరకన్ను గొంత దెఱచుకొన్న ట్లుండెను. జంబుకేశ్వరుని మనస్సులో నే వికారమును లేదు. ఆతఁడు దినమును వలెనే, విరూపాక్షునకు నమస్కరించెను. ఆ నమ స్కారమునకు విశ్వవ్యాపార నాట్యమునకుఁ దన్ను బాగుగ వినియోగించు కొమ్మని యర్థము. మూడవరోజు 'కుమ్మ టముఁ' గూడ డిల్లీసుల్తానునకు గైవసమయ్యెను. నాడును జంబుకేశ్వరునకు విరూపాక్ష సేవ ఘటిల్లెను.

జంబుకేశ్వరుని సైన్యమున మిగిలినవారిక గొందఱు రౌతులు మాత్రమే వారును గొన్నినూఱులు. అశ్వసైన్య మొక యిఱునూఱు మాత్రమే జీవించి యున్నది. ఏన్గులు గొన్ని పదులు మాత్రమే యుద్ధమునకు సిద్ధముగ నుండెను.

మరుదినము తెల్లవారెను. ఆనెగొందికి రెండు కోట లున్నవి. అయిదు కోట లింతకుముందే చక్రవర్తికి స్వాధీన మయ్యెను. కొండక్రింద నొకకోట గలదు. దానికి 'పెద్దమ కోట' యని పేరు. కొండపైనున్న కోటకు 'చిన్నమకోట' యందురు. ఢిల్లీ సైన్యములు పెద్దమ కోటను దాకినవి. ఆ వప్రము మహా బలిష్ఠమైనది. వప్ర ప్రాకారములపై నిలువఁబడి వీరులైన రాతులు శత్రువులను లగ్గలు బట్టనివ్వక యెదురించు చుండిరి. ఆ నాటి యుద్ధమునకు సేనాధ్యక్షుఁడు జంబుకేశ్వ రుఁడే ఆతని వార్ధక్యము యుద్ధోత్సాహమున కేమియు నడ్డము వచ్చుటలేదు. జంబుకేశ్వరుఁ డొక మేలిరకపు గుఱ్ఱ ముపైఁ గూర్చుండి సమరము సేయుచున్నాఁడు. ఆతఁ డొకడే యైనను నాహవ రంగమున నెనిమిది మూర్తులుగఁ గనపడు చుండెను. ఒకటే క్షణమున నెనిమిది దిక్కులం దాతఁడుండి సైన్యముల నెచ్చరించు చుండినటు లుండెడిది. జంబుకేశ్వ రుని యశ్వసంచాలనా నైపుణి యట్టిది ! ఆ గుఱ్ఱపు నడక యూ పాటిది ! ఢిల్లీ సైన్యములు క్రింద నుండి కోట నెక్కు టకై నానా యాతనలు బడుచుండెను. కాని పైనున్న వీరులు వీరి నెక్కనిచ్చినగదా ! తల గనపడినదే తడ వది నఱకఁబడుచుండెను. తురుష్క సైన్యములను వెనుక పాటు నుండి కుంతలదేశ ప్రజలుఁ దాకినారు. వారి ప్రధానాయు ధములు ధనుస్సులు, ఒడిసెలలు. వారు వైరులకుఁ గన్పడరు. వారి శస్త్రములు మాత్రము బుంఖానుపుంఖములై శత్రువుల

నురుమాడు చుండును. కొన్ని సైన్యము —లా ప్రజల నడ్డ
గించుటకైఁ బయాణించెను. వారు వీరికిఁ దొఱకినగదా
యడ్డగించుట ! ఆ ప్రజావాహిని కొండ లోయలలో, దాగి
కొనును. భూగర్భములఁ బడి ప్రయాణించును. జట్టులుగఁ
జీలి యుద్ధము సేయును. ఈ ప్రజాసైన్యమునకు విద్యారణ్యులు
నాయకులు. చరిత్రకారులు వారినొకఁ దపస్విగ— శ్రీ
విద్యోపాసకులుగ మాత్రమే యెఱుఁగుదురు. కాని, నాటి
ప్రజానాయకులుగ వారు దేశమున కొనర్చిన సేవ గొప్పది.

మధ్యాహ్నము మీఱిపోయెను. వైరులకు పెద్దమకోట
గైవసమగు చాయలు గన్పడలేదు. సేన లపారముగ నష్టమై
పోవుచుండెను. వారా కోటవాకిండ్లు బగులఁ గొట్టఁ బ్రయ
త్నించినారు. ఏనుగుల నాకోటవాకిండ్లకు దాకించిరి. కాని
యాద్వారముల గుబ్బలయందుఁ బదునైనకత్తులు జెక్కఁబడి
యుండెను. ఏనుగులు వచ్చి వాకిండ్లకు ఢీకొనును. వెంటనే
గత్తులు కుంభస్థలముల దూసికొని పోవును. అవి ఘీంకారము
లొనర్చుచు వెనుకకు మరలును. రాహుత్తు లెన్ని యోసాయులు
ప్రయత్నించిరి. ఉన్మదములైన గజములు ముందుకుఁ గదలనే
కదలవు.

ఢిల్లీ సైనికుల కేమియుఁ దోచినదిగాదు. వెనుకనుండి
ప్రజాసైన్యములు దమ్మమితముగ బీడించుచుండెను. వారినిఁ
బట్టఁ బోయిన బక్షులవలెఁ బర్వెత్తుచుండిరి. సాయంకాలము
దగ్గరించుచుండెను. ఢిల్లీసైనికులు కోట వాకిండ్లపై

శిలలనుఁ జేర్చి వానిపై నేస్తులను నుగ్గించినారు. ఓరంత ప్రొద్దు నకుఁ గోటవాకిండ్లుఁ బగిలెను. శత్రువుల సైన్యములు లోనికి నుగ్గినవి. నుగ్గుటయే దడ వాకోట యంచులందు రహస్యముగఁ నిలువఁబడియున్న వీరులు శత్రువులను బిండి పిండి యొనర్చిరి. కాని సుల్తానుసేన యసంఖ్యాకముగ నుండెను. ఎంత మందిని జంపినను నాసైన్యము దొరలు తెరలై పైఁబడుచుండెను. జంబుకేశ్వరుని సైన్యమునగూడ గొన్ని నూఱులు సైనికులు వీరశయన మందినారు. ఇక మిగిలిన సైన్యము చాలకొద్ది. సాయంకాల మగునరికి ఢిల్లీ సుల్తానునకు 'పెద్దమకోట' సంపూర్ణముగఁ స్వాధీనమైనది. జంబుకేశ్వరుని సైన్యములు 'చిన్నమకోటఁ' రినవి. శత్రు సైన్యములుఁ జిన్నమకోటకుఁ జుట్టును నాక్రమించుకొన్నవి. ఆనాడు విరూపాక్షాలయ పరిసరము లందంతయు శత్రువులే అర్చకులు మొదలైన వా రెవ్వరును నా కోవెలలో లేరు. వారెల్లరు విద్యారణ్యుల ప్రజాసైన్యములలోఁ జేరినారు. కోవెలలో నలంకారములు లేవు. దీపకాంతులు లేవు. పంపా దేవికి నలంకారముల యాటోపములేదు. ఏకాంతమున విరూ పాక్షుఁ డొక్కఁడే యుండెను. ఆమూర్తి తనలోఁ దానేమో యనుకొను చున్నట్లుండెను. అప్పుడు గూడ విరూపాక్షుని మూఁడవ కన్ను మరి కొంచెము దెఱచికొని యే యుండెను.

తుంగభద్రాదేవి రక్తాంబర ధారిణి యైనది. ఆమె యంబరకాంతి నేఁ డింకను నరుణముగ నుండెను. ఆ యాధిక్యము వీరరాహుత్తుల రక్తము గలియుటచే నైనది.

జంబుకేశ్వరుఁ డానాఁడు విరూపాక్షుని కో వెలకుఁ బోలేదు. అతఁడు ప్రాసాదో పరితలమునుండి విరూపాక్షుని గుడివైపుఁ దిరిగి నమస్కరించెను. అప్పుడు విరూపాక్షుని మూర్తి జంబుకేశ్వరుని హృదయమున భాసిల్లెను. భాసిల్లిన యా మూర్తిలో ముఖ్యముగ గన్పడినది మూఁడవకన్ను. అదియు నాఁడిక గొంత విచ్చికొనియుండెను.

దిక్కులన్నియును గాఢ చీకటు లలమికొన్నవి. 'చిన్నమకోటకు' వెలుపల భయంకరముగ శత్రువుల యార్భాటములు, అవహేళనలు, వెర్రికేకలు, వినబడు చుండెను. ఆ రాత్రిఁ గూడ సమర రంగముపై గ్రద్ద లాడు చునే యుండెను. వానికంత పేరాశ యెందుకో! రాత్రియందా పక్షులు స్పష్టముగఁ గన్పడుట లేదు. మఱి వినబడునది వాని ఱెక్కల చప్పుళ్ళు మాత్రమే! అవి సమర రంగమందు వికటముగ నాడు, మృత్యుదేవి యొక్క కాలి యందెల ఘలంఘలల వలె నుండెను.

జంబుకేశ్వరున కంతఃపురమందు నిద్రబట్టుట లేదు. అతని యెదయెల్ల వేదనాభరితమై యుండెను. తన కా దినమున విరూపాక్ష దర్శనము ప్రాప్తింపలేదు. ఆ విషయము జ్ఞప్తి కెలసి నంతనే మహారాజు కన్నులలో నాణిముత్తె

ముల వంటి బాష్పములు !! వీని నాతఁడు దుడిచి కొనుచునే సౌధ సోపానము లెక్కెను. దూరమునుండి యాలయము వైపుఁ జూపు నిగిడ్చినాడు. ఆ స్వామి కోవెల నంతయుఁ గటిక చీకటి గప్పినది. ఆ చీకటిలో విరూపాక్షు నాలయము గుర్తు దెలియుటయే లేదు. బాగుగ గమనించి చూచి జంబు కేశ్వరుఁ 'దదియాలయ మగునని' గుర్తుఁ బట్టెను ! ఆహా ఇంతకు ముందా విరూపాక్షుని సన్నిధి యట్లుండెడిదో ? ఆ స్వామి యేడు గోపురములపై నెన్ని కాచదీపములో ! ఏ కాంతమున జంబుకేశ్వరుఁడు వెక్కి యేడ్చినాడు. అది యేకాంతము గనుక నాతఁ డంత వెక్కి యేడ్చెను. చేతులు జోడించి నిలుచున్న జంబుకేశ్వరుని యెదుట, నాలయములో నెఱ్ఱని కాంతి గనుపడ్డది. ఆ కాంతి గటిక చీకటులఁ బొడుచుకొని జంబుకేశ్వరునిపైఁ బడెను. ఆ కాంతి యేమి ? చకితుఁడైన జంబుకేశ్వరుఁ డొకసారి గన్నులు నులుముకొని చూచినాఁడు. ఆ యెఱ్ఱని కాంతిలో విరూపాక్ష లింగముఁ దనకు స్పష్టముగఁ గన్పడెను. ఆ తేజఃపుంజము విరూపాక్షుని జిచ్చర కన్ను. ఆ కన్ను ద న్నీక్షించుచున్నట్లు జంబుకేశ్వరునకు భాసించెను. అతఁ డొక గోడను వెంటనే యానుకొననిచో సౌధోపరితలమునుండి గ్రిందఁబడి యుండెడివాఁడు. జంబుకేశ్వరుఁడు తుంగభద్రా నదివైపు జూచెను. ఆశ్చర్యము ! ఆ రాత్రిలో నామెగట్టిన యరుణాంబరము జిగజిగ మెఱసిపోవుచుండెను. ఇఁక జంబుకేశ్వరుఁ డచ్చట నిలువ లేక

పోయెను. అతఁడు క్రిందికిఁ దిగివచ్చినాఁడు. నడురాత్రి గొంత మీరినది. జంబుకేశ్వర మహారాజు 'బహాదుద్దీను'నకుఁ గబురంపెను. పరిచారకు లాతనిఁ గొనివచ్చిరి. జంబుకేశ్వరుఁడు సంభాషణము నారంభించినాఁడు.

'మిత్రమా నా సర్వబల మీనాటి కంతరించి పోయినది. రేపటి యుద్ధమున నాకు మృత్యువు సిద్ధము. నా మరణానంతరము నిన్ను శత్రువులు జంపుదురు. ఆ దుస్సంఘటనము నా కిష్టములేదు. మూఁడవ బల్లాణదేవుఁడు నా మిత్రుఁడు. అతఁడు 'తానూరు' నం దున్నాఁడు. నిన్నచటికి రహస్యముగఁ బంపెదను. ఆతఁడు నిన్ను రక్షించి ంరును.'

'బహాదుద్దీను'నకు నోట మాట రాలేదు. అతఁడు జంబుకేశ్వరుని కాళ్ళపైఁ బడి శిశువువలె గోలుగోలున నేడ్చెను. మఱు నిముసమందే మేనాలు దయారైనవి. వానిలో బహాదుద్దీను దారాసుతులుఁ గూర్చున్నారు. బహాదుద్దీను కొఱకై యొక సమర్థమైన హయము సన్నాహపరుపఁ బడెను. జంబుకేశ్వరుని భార్య, బహాదుద్దీను సతి 'జులేఖా'ను గట్టిగఁ గౌగలించుకొన్నది. జంబుకేశ్వరుఁడు 'బహాదుద్దీను'ను మనసార నాలింగనముఁ జేసికొనెను. వారి దే మతమైననేమి ? వారి హృదయ ప్రేమ కప్పుడు మతము లడ్డురాలేదు. ధర్మములలోని సామాన్య విభేదము లడ్డు రాలేదు. క్షుద్రమైన మతమున కతీతమైన మానవ ధర్మ

మూనాడు వారి సేక కుటుంబమునుగఁ గావించినది. మతము, మొదలైన యున్మాదములు - స్వార్థపరులు దమ ప్రయోజనములను సాధించికొనుటకై యమాయకులపై వేయు నుచ్చులు. ఏ మతమే గాని రాక్షసత్వమును బోధింపదు. ఏ మతమేగాని దాన దయాది ధర్మముల నిషేధింపదు.

బహాదుద్దీనునకు రక్షగా జంబుకేశ్వరుఁడు గొంత పరివార మిచ్చెను. ఆ పరివారము బహాదుద్దీనును భూగర్భ మార్గములలోఁ గాగడాల వెలుగులోఁ గొనిపోయినవి. ఆ త్రోవలు శత్రువులకుఁ దెలియవు. ఆ భూగర్భ మార్గము లెక్కడో యొంత దూరమున నరణ్యములలోఁ జేరి పోవును.

ఆకాశమున వేగుచుక్క మినమిన లాడుచుండెను. అప్పటికే సేనానాయకులు జంబుకేశ్వరుని చుట్టును మూఁగిరి. బతికిన యుద్ధవీరు లొక నూఱుమంది మాత్రమే! పది పదునైదు గుఱ్ఱములు జీవించి యుండెను. పెద్దమకోట నుండి నడుమ నడుమఁ గొన్ని యేడ్పులు వినవచ్చుచుండెను. ఆ యేడ్పులు శత్రుసైన్యములవి. దానికి కారణము ప్రజావాహిని వారిని మాటి మాటికినిఁ బెట్టు సిలుగులు. ఆ రాత్రి యంతయు, తుగ్లకు సైన్యములపై బాణవర్షము గురియుచునే యుండెను. ఒడిసెలరాళ్ళుఁ బడుచునే యుండెను. ఆ విప్లవ కారుల సైన్యములకు నాయకుఁడు విద్యారణ్యులు. కాని

యెంత జేసిన నేమి ? తుగ్లకు సైన్యము లసంఖ్యాకములుగా నున్నవి.

జంబుకేశ్వర మహారాజు మహారాణులవైపుఁ జూచి నాఁడు. ఆతనికి మువ్వురు రాణులు. మువ్వురు రాణులలో బదునొకండుమంది సుతులు. జంబుకేశ్వరుని చూపులలో జాలి యుండెను. ఆ హాసనను బట్టపుదేవి గ్రహించినది. ఆమెకు జంబుకేశ్వరుని జాలి యిష్టము లేదు. హఠాత్తుగా నామె యన్నది. 'మే మెందుకైనను సిద్ధమే '

జంబుకేశ్వరుని గొంతు గద్గదమై వణఁకసాగెను. ఆయన బలికెను. 'దేవీ ! రేపు శత్రువులు కోటలోఁ బ్రవేశింతురు. మా మరణానంతరము స్త్రీల మానములు దక్కవు.' ఈ మాట లనుచు నాతఁ డక్కడ నిలువలేకపోయినాఁడు. ఆయన వారిని విడిచి కొంత దూర మేగెను.

పట్టపురాణి జంబుకేశ్వరుని వెను వెంట నే నడచినది. 'మా కిపు డేమి కర్తవ్యము ? శస్త్రప్రహారమా? అగ్ని ప్రవేశమా ?' ఆమె యడిగెను.

మహారా జామెవైపుఁ జూచుటయే లేదు. తనలోఁ దా నతఁడు 'అగ్ని వంటి యువతుల కగ్ని ప్రవేశమే యుత్తమము'యని యనుకొనెను.

వెంటనే మహారాణి యాజ్ఞతో 'తారపర్వతము'న గట్టెలు జేర్పఁబడినవి. అవి చందన కాష్ఠములు. హరిహరాది మంత్రులు కంపన మొదలైన సేనాధ్యక్షులు, - నా

వీరమాతలకు మనసార నమస్కరించిరి. నూతన వస్త్రాలంకృతలై వివిధ భూషణోజ్వల తనులై, యా వనితలు జంబుకేశ్వరునకు నమస్కరించి భూగర్భ మార్గములలో దారపర్వతమునకు నడచి వెళ్ళినారు. వారి వెనకల మువ్వురు కోదండ్రుడు గూడ నడచిరి వారిని జంబుకేశ్వర సుతులు ముగ్గురు కౌగలించికొని సాగనంపినారు.

చీకటులు కొద్దికొద్దిగ విడిపోవుచుండెను. పారావత పక్షి ధూసరములై - ప్రభాత కాంతు లల్ల నల్లఁ దొంగి చూచుచుండెను. తార పర్వతముపై బ్రహ్మాండమగు మంటలు రేగినవి. మువ్వురు రాణు లందు లీనమై పోయిరి. మువ్వురు కోదండ్రా యత్తల ననుసరించిరి. అగ్నివంటి స్త్రీలగ్నియందే లీనమైనారు. కార్యము కారణమం దైక్యమయ్యెను. వహ్నిలోఁ జొరఁబడిన యా యార్గురు నగ్ని దేవున కాఱు జ్వాలికలైరి.

ప్రాసాదోపరితలము నుండి జంబుకేశ్వరుఁ డీ దృశ్యమును జూచుచునే యుండెను. వారెల్ల రగ్నియందు గాలి పోవుసరికి భళ్ళున దెల్లవారెను. వారి యగ్ని ప్రవేశమును గాంచుచున్న జంబుకేశ్వరుని కన్నులలో బాష్పములు లేవు. ఆతఁడొక శిలవలె నా దృశ్యమును గాంచెను. నాట నుండి జంబుకేశ్వరుఁడు శిలయే ఎఱ్ఱని ప్రభాతకాంతులలో, విరూపాక్షుని యాలయ మా మహారాజునకు గోచరించెను. ఆలయము గన్పడి నంతనే జంబుకేశ్వరుని సంతోష మింతంత

గాను. ఆతఁడు వికటముగ నట్టహాసమొనర్చెను. అది యొక ప్రమథుని యట్టహాసము. విరూపాక్షునకు జంబుకేశ్వరుఁడు కై మోడ్చెను. Acc No. 7362

84 1200

కోట వాకిండ్లు దెరువఁబడినవి. జంబుకేశ్వరుని నూర్గురు యోధులును ఏకవీరులవలెఁ బోరాడిరి. ఆ యుద్ధము నందు యువరాజు 'రామనాథుని' విక్రమము బ్రశంసనీయమై యుండెను. జంబుకేశ్వరుఁ డీనిన పులివలె శత్రువులపైఁ బడి తెగనఱికెను. ఆనాఁ డాతనిలో నేదో రుద్రాంశ మావేశించినది. 'రామనాథుఁడు' దండ్రికి సమీపముననే నిలచి పోరుచుండెను. వానిని నూఱుమంది రౌతులు జుట్టుకొన్నారు. ఆ నూఱుమందికి వాని యొక్క ఖడ్గమే బదులు చెప్పుచుండెను. ఆనాటి రామనాథుని విక్రమము—యేనాటి యభిమన్యు కుమారుని విక్రమమునో సేనాధ్యక్షులకుఁ దోపింపఁ జేసినది. పోరి పోరి వాని కలసట యైనది. శత్రువీరుఁ డొకఁడు రామనాథుని తల దెగ నఱికెను. ఆ శిరస్సు జెంగున నెగిరి జంబుకేశ్వరుని సన్నిధిని బడినది. 894-8133
NAR

కుమారుని శిరస్సునుఁ జూచిన తండ్రికి హఠాత్తుగ రెండుబొట్టుల కన్నీరు రాలెను. జంబుకేశ్వరుని యెదుట విరూపాక్షుని దర్శనమైనది. ఆతని చిచ్చరకన్ను జాజ్వల్యమానముగ వెలుఁగుచుండెను. విరూపాక్షుఁడుఁ 'ప న్నాకంటిలో నైక్యమగు' మని రాజును సంబోధించి నట్లయ్యెను.

ఎదుట యుద్ధము చేయుచున్న శత్రువీరునిపై జంబు కేశ్వరుఁడు చేతి కొలఁది ఖడ్గమును విసరినాడు. కాని యా గురి దప్పిపోయినది. గురి దప్పుట కాతని జీవితములో నిదియే తొలిసారి. మఱునిముసమందే శత్రువీరుని ఖడ్గము జంబుకేశ్వరుని శిరస్సును నఱికివేసినది. ఆ రాజయోగి శిరస్సు మొండెము నుండి వేఱయ్యెను.

జంబుకేశ్వరుఁడు మరణించెను. శివాంశము శివునిలో నైక్యమైనది. జంబుకేశ్వరుని సంతాన మంతయు నా యుద్ధమున వీరమరణ మందెను. ఆ మహారాజు వంశమున మఱి యెవ్వరును మిగులలేదు.

ఆ ప్రజలకు జంబుకేశ్వరుఁడు శివాంశ యని విశ్వాసము. వా రాతనికి గుడి గట్టిరి. జంబుకేశ్వరుని మూర్తి నా యాలయమందుఁ బ్రతిష్ఠించినారు. నేటికి నా గుడిలో జంబుకేశ్వరునికిఁ బూజ జరగుచుండును. జంబుకేశ్వరుఁడు శివాంశ యని ప్రజల విశ్వాసము.